SREE

# Mokshasarardha

SANGRAHAM

AND

# Bhagavadgitartha

SANGRAHAM

WITH COMMENTARY

BY

*Sreeman Madabhooshi Vadi Mathebha Kanthiravam*

SIMHADRI APPALACHARYULU GARU.

FIRST EDITION, 1,000 COPIES.

1913.



*Price 12 As.*

COCANADA:

PRINTED BY SCAPᵀ & COMPANY.

శ్రీ

# మోక్షసారార్థసంగ్రహము.

# గీతార్థసంగ్రహము.

సటీక.

ఈసంపుటము

శ్రీమాన్ మాడభూషి వాదిమత్తేభకంఠీరవం

## సింహాద్రి అప్పలాచార్యులవారిచే

రచియింపఁబడి ప్రకటింపఁబడియె.





కాకినాడ.

స్కేప్ అండు కో., ప్రింటర్సు.

1913.



[వెల రు 0—12—0.

శ్రీః శ్రియైనమః
శ్రీహయగ్రీవాయనమః
శ్రీమతేరామానుజాయనమః



# పీఠిక.

ప్రపన్నులారా! ఆర్యమతములన్నిటిలో "కేచిదద్వైతమిచ్ఛంతి ద్వైతమిచ్ఛంతి చాపరే। సమంతత్త్వం నజానంతి ద్వైతాద్వైతవివర్జితమ్" అని భగవద్వాక్యముచే ప్రసిద్ధిచెందుచుండు సర్వజనసమ్మతమైన శ్రీవిశిష్టాద్వైతమతమును ప్రజ్వలింపజేసిన శ్రీరామానుజులవారిచేత సర్వచేతనోజ్జీవనార్థమై స్థాపింపబడినట్టిన్ని, మతగ్రంథములను వారున్ను, మనపూర్వాచార్యులవారున్ను విశదీకరించిన గ్రంథములనేకములు సంస్కృతమందు ద్రావిడభాషయందుండుటచే ఆంధ్రదేశీయులకు ఆభాషాజ్ఞానములేకపోవుటచే మోక్షహేతువులైన యాగ్రంథములయందున్న సారమును గ్రహింపజాలక వారి స్వభాషయైన ఆంధ్రభాషలో విశదీకరించుమని అనేకపెద్దలు సూచించుటచే నాయథాశక్తిని యీమోక్షసారార్థసంగ్రహమును, యామునాచార్యకృతమగు భగవద్గీతార్థసంగ్రహమునకు టిప్పణితాత్పర్యములను అందరకు తెల్లంబగునట్లు తెలుగుభాషయందే వ్రాసితిని. ఈగ్రంథమందు బ్రహ్మసూత్రశ్రుతిస్మృతిపురాణము లధికముగానుండును. అయినను ఈగ్రంథములోని సారమును పెద్దలుగ్రహించి "అనంతశాస్త్రం బహువేదితవ్యం। స్వల్పశ్చకాలో బహవశ్చవిఘ్నాః। యత్సారభూతం తదుపాసితవ్యం హంసోయథాక్షీరమివాంబుమిశ్రం" అనునట్లు యీగ్రంథమందలి తప్పులను యెంచక గుణాధికమునే గ్రహించి ఆనందింతురని నమ్ముచున్నాను.

ఈగ్రంథములు ముద్రించునపుడు నేను గ్రామాంతరమందున్నను, ప్రూపులుదిద్ది నాకు అన్నివిధముల సహాయముచేసినట్టి కాకినాడనివాసులున్ను, మదన్వయులున్ను, అయిన శ్రీమాన్ మాడభూషి వాదిమత్తేభకంఠీరవం, సింహాద్రి అప్పలాచార్యులుగారికి నాకృతజ్ఞతను వెల్లడిచేయుచున్నాను.

శ్రీ

ఇట్లు,
శ్రీమాన్ మాడభూషి వాదిమత్తేభకంఠీరవం
సింహాద్రి, అప్పలాచార్యులు.

# శుద్ధపత్రిక.

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 13 | విషరం | వికరం |
| 6 | 22 | చిద్వి | అచిద్వి |
| 9 | 1 | పచీ | పంచీ |
| 11 | 8 | కనిపుణుల | కునిపుత్రుల |
| 14 | 9 | దుష్పన్న | దుత్పన్న |
| 15 | 20 | భాగ్య | భోగ్య |
| 16 | 18 | కృత్స్నర్థా | కృత్యర్థా |
| 17 | 23 | కారార్థా | ఉకారార్థా |
| 22 | 8 | ఊహ | ప్ర్యూహ |
| 30 | 2 | బ్రాహ్మణ | బృంహాణం |
| ,, | 12 | నమే | నేమే |
| ,, | 13 | త్రాణిపో | త్రాణినాషో |
| ,, | 15 | పరుచేం | పరుణేం |
| 32 | 24 | దిన్య | ధీస్య |
| 42 | 10 | యస్తి | యదస్తి |
| 44 | 25 | హ్యాకమే | హ్యాహమే |
| 45 | 9 | పిత | పిః |
| 55 | 2 | యాజ్ఞవత్క్యః | యాజ్ఞవల్క్యః |
| 56 | 17 | నికే | నిరే |
| 60 | 15 | చాక్షుపతే | చాక్షుషతే |
| 64 | 14 | అయా | యయా |
| ,, | 15 | అదే | అవే |
| 73 | 12 | తాదాత్మ్య | తాదాత్మ్యా |
| 76 | 20 | కాబో | కాకబో |
| 82 | 7 | హిఃసిపు | హిఃప్ర |
| 88 | 10 | సీత్ | సీత |

# ప్రార్థనా శ్లోకములు.



శ్లో॥ పాండురాభేందుసంకాశం కుండలాభ్యాం విరాజితం
సర్వవిద్యాప్రదాతారం హయగ్రీవం నమామ్యహమ్॥

శ్లో॥ క్షీరాబ్ధితనయాం దేవీం కామితార్థప్రదాయినీమ్
దారిద్ర్యధ్వంసనీంలక్ష్మీం వందేహం పద్మమాలినీమ్॥

శ్లో॥ బౌద్ధపాషండజేతారం సూత్రభాష్యప్రవర్తకం
కుదృష్టిధ్వంసకర్తారం వందే రామానుజంగురుమ్॥

శ్లో॥ వేదవేదాన్తతత్వజ్ఞం సదాచారప్రవర్తకమ్
వాత్సల్యాదిగుణావాసం లోకాచార్యం నమామ్యహమ్॥

శ్లో॥ వేదాన్తద్వయవక్తారం కామక్రోధాదివర్జితం
శమాదిగుణసంపన్నం వందేవేంకటదేశికమ్॥

శ్లో॥ ఆచార్యస్య కులీనస్య వేంకటార్యగురోస్సుతమ్
రామానుజఇతిఖ్యాతం తం వందేప్రపితామహమ్॥

శ్లో॥ వేదాన్తబ్రహ్మసూత్రాణాం వ్యాఖ్యాతత్వసుబోధినీ
కృతారామానుజార్యేణ సర్వజ్ఞానాభివృద్ధయె॥

శ్లో॥ రామానుజగురోః పుత్రం గోవిందార్యఇతిస్మృతం
సత్సంప్రదాయసంపన్నం తం వందేహం పితామహమ్॥

శ్లో॥ భగవద్భక్తితత్వజ్ఞో ధర్మనిష్ఠస్సుబుద్ధిమాన్
కృష్ణమార్యఇతిఖ్యాతో కులే నేద్ధ్రువకౌశ్యపె॥

శ్లో॥ మయాతజ్జేష్ఠపుత్రేణ మోక్షసారార్థసంగ్రహః
రచితోయం మహద్గ్రంథో భగవద్భక్తి సిద్ధయె॥

శ్రీ శ్రీ శ్రీ

శ్రీం శ్రియైనమః

శ్రీహయగ్రీవాయనమః

శ్రీమతేరామానుజాయనమః

# మోక్షసారార్థసంగ్రహము.

## జీ వ ప్ర క ర ణ ము.

ముముక్షువైన జీవునికి మోక్షము కావలెననునపుడు తత్త్వత్రయజ్ఞానము కావలెను. తత్త్వత్రయమనగా జీవుడు, ప్రకృతి, ఈశ్వరుడు. చిత్తనగా, జీవుడు. జీవస్వరూపమేమనగా, దేహేంద్రియమనఃప్రాణబుద్ధి విలక్షణమై, అజడమై, ఆనందరూపమై, నిత్యమై, అణువై, అవ్యక్తమై, అచిన్త్యమై, నిరావయవమై, నిర్వికారమై, జ్ఞానాశ్రయమై, ఈశ్వరునికి నియామ్యమై, ధార్యమై, శేషమై యుండును. జీవస్వరూపము దేహాదివిలక్షణముగా నుండడమెందుకనగా దేహాదులు నాయొక్క దేహాదులని ఆత్మలో వేరుగాతోచుటచేతను ఇదియనితోచుటచేతను ఆత్మ నేనని తోచుటచేతను ఇవి యొకసమయమందు తోచి మరియొకసమయమందు తోచకపోవుటచేతను ఆత్మ యెప్పుడు తోచుటచేతను ఇవి యనేకములగుటచేతను ఆత్మ యొకడగుటచేతను జీవుడు వీట్లలో విలక్షణమని భావించవలెను. ఈయుక్తులు ప్రత్యక్షముకానివైనను శాస్త్రబలముచే జీవుడు దేహాదివిలక్షణముగాగలడు. అజడమనగా జ్ఞానమును విడచి తానేతోచడము. ఆనందరూపమనగా సుఖరూపమైయుండుట. నిద్రించినవాడు సుఖముగా నిద్రించితి ననుటచే సుఖరూపముగా గలడు. నిత్యమనగా యెప్పుడునుండుట. ఎప్పుడున్నుఉన్నట్టయితే జన్మమరణములు గలుగుట

యేలాగనగా జన్మమనగా దేహసంబంధము. మరణమనగా దేహవియోగము. అణువైనదెందుకనగా హృదయప్రదేశమునుంచి పోవుచున్నది వచ్చుచున్నదియని శాస్త్రముచెప్పుటచే జీవుడు అణువుగాగలడు. అణువై హృదయమందున్నట్టయినా శరీరమంతయు సమానసుఖదుఃఖములనుభవించడ మెందుకనగా, మణిసూర్యదీపాదు లొకచోటయుండగా కాంతి అంతట సమానముగా వ్యాపించునటువలె జ్ఞానమంతటను సమానముగా వ్యాపించుటచేతను, అవి వీటిని యనుభవించుటకు బాధ లేదు. ఒక దేశకాలమందు అనేకదేహములను ధరించడమున్ను జ్ఞానవ్యాప్తిచేతనే. అవ్యక్తమనగా ఘటపటాదులను గ్రహించే చక్షురాదులవలన తోచకుండాయుండడము. అచిన్త్యమగుటయనగా, ప్రకృతితో సజాతియమని తలచకూడనదియై యుండుట. నిరవయవమనగా, అవయవసముదాయము లేకుండా యుండడము. నిర్వికారమనగా, ప్రకృతివలె వికారించడములేకయే ఒకేవిధముగా యుండడము. ఈలాగునయుండుటచే శస్త్రము, అగ్ని, జలము, వాయువు, ఆతపము మొదలగువాట్లచే భేదించుట, దహించుట, తడుపుట, ఇగిరింపచేయుట ఇవిచేయుటకు వీలులేకయుండును. అహర్హతులు (................) జీవుని దేహపరిమాణముగా చెప్పినారు. అది శ్రుతివిరుద్ధము. అనేకదేహములను పరిగ్రహించే యోగులస్వరూపమునకు నాశనమువచ్చును. జ్ఞానాశ్రయమనగా జ్ఞానమునకు యునికిపట్టుగా యుండడము. జీవుడు జ్ఞానమునకు యునికిపట్టుగా యుండుటయే గాక జ్ఞానమేయుంటే, నాకుతెలుసునని చెప్పనలెను, నాకుతెలియదని చెప్పకూడదు, జ్ఞాతవన్నప్పుడే కర్తాభోక్తాయని చెప్పడమైనది, కర్తృత్వభోక్తృత్వములు జ్ఞానావస్థయొక్క భేదములగుటచేతను, కొందరు, గుణములకేకర్తృత్వము గలదు, ఆత్మకు లేదన్నారు. అప్పడితనికి శాస్త్రవశ్యమున్ను భోక్తృత్వమున్ను నశించును. సంసారికప్రవృత్తులయందు కర్తృత్వము స్వరూపప్రయుక్తముకాదు.

గుణసంసర్గకృతము, కర్తృత్వమే ఈశ్వరాధీనము, జ్ఞానాశ్రయమైతే శాస్త్రములయందితనిని జ్ఞానస్వరూపుడనిచెప్పుట యేమంటే, జ్ఞానములే కయే తన్ను తెలుసుకోవడముచేతనున్ను, జ్ఞానము సారభూతగుణమై ని రూపకధర్మమగుటచేతనున్ను చెప్పబడినది. నియామ్యమగుటయనగా, ఈశ్వరబుద్ధ్యాధీనముగా సర్వవ్యాపారములుకలదై యుండడము. ధార్య మగుటయనగా, యతనియొక్క స్వరూపసంకల్పములులేనప్పుడు తనసత్తు లేనట్టుయుండడము, శేషమగుటయనగా గంధము, పుష్పము, తాంబూ లాదులవలె యతని ఇష్టవినియోగార్హమైయుండడము. ఇదే, గృహ, క్షేత్ర, పుత్ర, కళత్రాదులువలె పృథక్సిద్ధ్యాదులకు యోగ్యమయ్యే లాగుయుండుటయు గాక శరీరమువలె వాటికి యోగ్యముగా యుండడ ము, జీవస్వరూపమే బద్ధముక్త, నిత్యరూపములచేతను మూడువిధము లుగానుండును. బద్ధులనగా సంసారులు. ముక్తులనగా, సంసారబంధ ములేనివారలు నిత్యులనగా, ఎల్లప్పుడుసంసారములేని శేష శేషాశనా దులు, జలమునకు అగ్నిసంస్పృష్టస్థాలీసంసర్గముచేతను ఔష్ణశబ్దాదులు గ లిగినట్లే జీవునికి ప్రకృతిసంబంధముచేతను అవిద్యాకర్మవాసనారుచు లుండడము, ప్రకృతినివిడచినతోడనే అవిద్యాదులు వదలుచున్నవని చెప్పుదురు. ఇవిమూడున్ను వేర్వేరుగాయనంతములై యుండును. కొం దరు ఆత్మభేదములేదు, ఆత్మయొకటియేకద్దు అందురు. అట్టిపక్షమం దు ఒకడుసుఖించుకాలములో వేరొకడుదుఃఖించకూడదు. అదిదేహభే దముచేతనంటే సౌభరిశరీరమందున్ను యదిగనుగొనవలెను. ఒకడు సం సారములోయుండుటయును, ఒకడుముక్తుడగుటయును, ఒకడుశిష్యుడగు టయును, ఒకడాచార్యుడగుటయును, విషమసృష్టియును కూడదు. ఆత్మ భేదమును చెప్పే శ్రుతికోటిన్ని భంగించును. శ్రుతియుపాధిభేదము ను చెప్పుచున్నదనియెంచకూడదు. మోక్షదశయందుభేదముండుటచే, అప్పుడుదేవమనుష్యాదిభేదము కామక్రోధాదిభేదమున్ను, విడచి, జీవ

స్వరూపము మిక్కిలిసమమై యేవిధముచేతనున్ను భేదముచెప్పసాధ్యము కానట్లు యున్నప్పటికి కొలతయు, తూనికయు, ఆకారమున్ను, సమము గాయుండేబంగారుకడవలు, రత్నములు, ధాన్యములు, మొదలగువాటి కి భేదమున్నట్లుగానే స్వరూపభేదమున్నుసిద్ధము. కాబట్టి యాత్మభేద ము గ్రహించవలెను. ఇప్పుడు వీళ్ళకులక్షణము శేషత్వముతోగూడిన జ్ఞాతృత్వము వీరలజ్ఞానమేస్వరూపమువలె నిత్యద్రవ్యమై అజడమై ఆనం దరూపమైయుండును. అయితే జ్ఞానమునకును స్వరూపమునకును తారత మ్యమేమనగా, స్వరూపముధర్మియై సంకోచవికాసములకయోగ్యమై త న్నుగాక ఇతరములను ప్రకాశింపచేయకపోవుటచేత తనకుతానే ప్రకా శించే పత్తాగలదై యణువై యుండును. జ్ఞానము ధర్మమై సంకోచవికాస ములకుయోగ్యమై తన్నుగాక ఇతరములైనవాటిని ప్రకాశింపచేయుదగి నదై తనకుతానేప్రకాశించక యాత్మ ప్రకాశింపచేయదగినదై వ్యాపక మైయుండును. వాటియందుకొందరిజ్ఞానమెప్పుడున్ను వ్యాపకమైయుండు ను. కొందరిజ్ఞానమవ్యాపకమైయుండును. కొందరిజ్ఞానమొకప్పుడు వ్యా పకముగాను మరియొకప్పుడవ్యాపకముగాను ఉండును. జ్ఞానము నిత్యమై నట్టైతే నాకుజ్ఞానముగలిగినది నశించినది అనేదేమంటే ఇంద్రియద్వారా ప్రసరించి విషయములను గ్రహించుటయున్ను జయించుటయున్ను, అవు టచేత ఆలాగునచెప్పటకు కొరతలేదు. ఇదే ఒకటిగాయుంటూ అ నేకముగాతోచడము ప్రసరణభేదముచేతను ద్రవ్యమెనరీతియేమంటే క్రియాగుణములకాశ్రయమై యజడమైయుండుటచేతను ద్రవ్యమనద గును. అజడమైతే సుషుప్తిమూర్ఛాదులలో తోచవద్దాయంటే ప్రస రణ లేకపోవుటచేతనుతోచదు. ఆనందరూపమంటే జ్ఞానముప్రకాశించు నపుడు అనుకూలమైయుండడము. విషశస్త్రాదులను చూపించునపుడు ప్రతికూలమైయుండుటకుగారణము దేహాత్మభ్రమాదులు. ఈశ్వరాత్మ యగుటచే సర్వపదార్థములకును యానుకూల్యమేస్వభావము ప్రాతికూ

ల్యముమధ్యవచ్చునది. ఇతరానుకూల్యము స్వాభావికమైతే ఒకనికొక కాలమందు ఒకచోటయనుకూలములైన గంధపుష్పాదులు దేశాన్తరమందును కాలాంతరమందును ఇతనికే ఆదేశమందే యాకాలమందే వేరొకరికిన్ని ప్రతికూలముకాకూడదు.



## ప్రకృతి ప్రకరణము.



ప్రకృతి జ్ఞానశూన్యమై వికారాస్పదమైయుండును. ఇదిశుద్ధసత్వమనిన్ని, మిశ్రసత్వమనిన్ని, సత్వశూన్యమనిన్ని, మూడువిధములు. ఇందులో శుద్ధసత్వమనగా రజస్తమస్సులుగలియక కేవలసత్వమై నిత్యమై జ్ఞానానందజనకమై కర్మచేతనుగాకుండా కేవలభగవదేచ్ఛచే విమానగోపుర మంటప ప్రాసాదాదిరూపములచే పరిణమించేదై నిరవధికతేజోపమై నిత్యముక్తులచేతనున్ను ఈశ్వరునిచేతనున్ను పరిచ్ఛేదించేదై యత్యద్భుతమైయుండేదొకటి. దీనిని కొందరుజడమన్నారు, కొందరజడమన్నారు. అజడమైనప్పుడు నిత్యులకును, ముక్తులకును, పరమాత్మకును, జ్ఞానము వినిచేతోచును; సంసారులకుతోచదు. ఆత్మలోనున్ను, జ్ఞానములోనున్ను, భిన్నమైనరీతి యెందుకనగా నేననితోచకపోవుటచేతనున్ను, శరీరములై పరిణమించుటచేతనున్ను, విషయములనువిడచి తానే తోచుటచేతనున్ను, శబ్దస్పర్శాదులుండుటచేతనున్ను, భిన్నముగాగా గలదు. మిశ్రసత్వమనగా సత్వరజస్తమస్సులు మూటితోటికూడి బద్ధచేతనునియొక్క జ్ఞానానందములకు తిరోధాయకమై విపరీతజ్ఞానజనకమై, నిత్యమై, ఈశ్వరునికిక్రీడాపరికరమై, ప్రదేశభేదముచేతనున్ను కాలభేదముచేతనున్ను సదృశమై విసదృశమై యుండును. వికారములనుగలిగించేదై ప్రకృతి, అవిద్యా మాయా యనేపేర్లుగలదై యుండును. దీన్ని

శేషము ప్రకృతియనేది వికారములనుపుట్టించే దగుటచేతను, అవిద్య యనగా జ్ఞానవిరోధియగుటచేతను, మాయయనగా, విచిత్రసృష్టిని చేసే దగుటచేతను, ఇదే ఇరువైనాలుగుతత్వములై యుండును. ఇందులో ప్రథమతత్వము ప్రకృతి. ఇది యవిభక్తతమస్సనిన్నీ, విభక్తతమస్సనిన్నీ, అక్షరమనిన్నీ, కొన్నియవస్థలుగలదై యుండును. ఇందులోనుంచి గుణవైషమ్యములచే మహదాదివికారములుపుట్టును. గుణములనగా సత్వరజస్తమస్సులు. ఇవి ప్రకృతికి స్వరూపానుబంధులై యస్వభావములై ప్రకృత్యవస్థయందు యనుద్భూతములై వికారదశయందుద్భూతములై యుండును. సత్వము జ్ఞానసుఖములనున్ను ఉభయసంగమునున్ను పుట్టించును. రజస్సు రాగతృష్ణాసంగములనున్న కర్మసంగమునున్ను పుట్టించును. తమస్సు విపరీతజ్ఞానమునున్ను అనవధానమునున్ను, ఆలస్యమునున్ను, నిద్రయున్ను, పుట్టించును. ఇవి సమానములైనపుడు వికారములు సమానములై యస్పష్టములై యుండును. విషమములైనపుడు వికారములు విషమములై స్పష్టములై యుండును. విషమవికారములలో ప్రథమవికారము మహత్తు. ఇది సాత్వికము, రాజసము, తామసము, యని త్రివిధమై అధ్యవసాయజనకమై యుండును. ఇందులోనుంచి వైకారికము, తైజసము, భూతాదికము, యని త్రివిధమైనయహంకారములుపుట్టును. అహంకార మభిమానహేతువై యుండును. ఇందులో యనగా వైకారికములోనుంచి శ్రోత్ర త్వక్, చక్షు, జిహ్వా, ఘ్రాణము లనే జ్ఞానేంద్రియములైదున్ను వాక్, పాణి, పాద, పాయూపస్థము లనే కర్మేంద్రియములైదున్ను మనస్సనే పదునొకొండింద్రియములున్ను పుట్టును. భూతాదులలోనుంచి శబ్దతన్మాత్రలు పుట్టును. ఇందులోనుంచి ఆకాశమున్ను స్పర్శతన్మాత్రలున్ను పుట్టును. ఇందులోనుంచి వాయువు రూపతన్మాత్రలు పుట్టును. ఇందులోనుంచి తేజస్సు రసతన్మాత్రలుపుట్టును. ఇందులోనుంచి అప్పుగంధతన్మాత్ర

లు పుట్టును. ఇందులోనుంచి పృథివిపుట్టును. స్పర్శతన్మాత్రము మొదలైన నాలుగుతన్మాత్రలు ఆకాశము మొదలైన నాలుగుభూతములకున్ను కార్యమై వాయువుమొదలైన నాలుగుభూతములకున్ను కారణమైయుండునని చెప్పుదురు. తన్మాత్రము లేవియనగా భూతములయొక్క సూక్ష్మావస్థలు తతిమ్మా రెండహంకారములున్ను స్వకార్యములను పుట్టించేటపుడు రాజసాహంకారము సహకారియై యుండును. సాత్వికయహంకారము శబ్దతన్మాత్రాదిపంచకమును బొంది సహకారియైయుండి శ్రోత్రాదిజ్ఞానేంద్రియములైదును సృజించును. దానినిసహాయముగా గొని వాగాదికర్మేంద్రియములైదింటిని సృజించును. వీట్లను విడచి తానే మనస్సునుసృజించునని చెప్పుదురు. కొందరు ఇంద్రియములలో గొన్నిటిని భూతకార్యమని చెప్పినారు. అది శాస్త్రవిరుద్ధము ఇవన్నియు భూతములాప్యాయకములు. ఇవిచేరితేనేతప్ప కార్యము లేకపోవుటచేతను మన్నును ఇసుకయును నీళ్ళునుచేర్చి గోడపెట్టేవారివలె ఈశ్వరుడు వీటినంతయును దనలోచేర్చి ఒకయండముగాచేసియందులో చతుర్ముఖ బ్రహ్మను సృజించెను. అండమునున్ను అండకారణమునున్ను దానేగలుగచేసెను. అండమునకులోబడినవస్తువులను చేతనులకంతర్యామియైనిల్చి యుండేటట్టుచేసును. అండములు తాననేకములై పదునాలుగులోకములతోటికూడి ఒకటికొకటిచేరికలసియున్న యేడావరణములచేచుట్టుకోబడి ఈశ్వరునికి క్రీడాకందుకస్థానీయములై జలబుద్బుదములవలె యేకకాలమందు సృష్టములైయుండును. భూతములయందు ఆకాశము యవకాశహేతువు వాయువువహనాదిహేతువు తేజస్సువచనాదిహేతువు జలము సేచనపిండీకరణాదిహేతువు పృథివీధారదాదిహేతువందురు. శ్రోత్రాదిజ్ఞానేంద్రియములైదింటికిన్ని ప్రత్యేకప్రత్యేకముశబ్దాదులైదింటిని గ్రహించడమువిధి. వాగాదికర్మేంద్రియములైదింటికిన్ని విసర్గ, శిల్ప, గత్యుక్తులువిధి. మనస్సువీటినన్నిటిని మధ్యస్థము. ఆకాశాదిభూతములకు

వరుసగాశబ్దాదులు గుణములై యుండును. గుణవినిమయము పంచకరణ ముచే ఆకాశమునల్లబడి తోచడము. దానివలననే ముందుముందుదానిని తన్మాత్రిలతోకూడుకొని యుత్తరోత్తరతన్మాత్రిలు స్వవిశేషములను పుట్టించుటచే గుణాధికముకలిగెనని చెప్పుదురు. సత్వశూన్యమనగా కాలము. ఇది ప్రకృతిప్రాకృతములయొక్క పరిణామములకు కారణమై కళా కాష్టాదిరూపముచే పరిణమించునదియై నిత్యమై, ఈశ్వరునికిక్రీడాపరికర మైశరీరభూతమైయుండును. ఇతరములైన రెండచిత్తులు ఈశ్వరునికిన్నీ జీవునికిన్నీ భోగ్యభోగోపకరణభోగస్థానములై యుండును. భోగ్యములన గా విషయములు భోగోపకరణములనగా చక్షురాదికరణములు భోగ స్థానములనగా చతుర్దశభువనములున్ను సమస్తదేహములున్ను వీటి యందు మొదటియచిత్తుకు క్రిందసరిహద్దుగల్గినలుచుట్టు పైనహద్దులేక నేయుండును. మధ్యయచిత్తుకు నలుతట్లాక్రింద హద్దులేకనే పైనహద్దు గల్గియుండును. కాలమెచ్చటనున్ను, యొకేరీతిగాగల్గియుండును. కాలమే పరమపదమందునిత్యము. ఇచ్చటయనిత్యమనిన్నీ చెప్పుదురు. కొందరు కాలములేదన్నారు. ప్రత్యక్షముచేతనున్ను ఆగమముచేతనున్ను సిద్ధిం చుటచేనది చెప్పగూడదు. అనేకులు దిక్కనిప్రత్యేకముగా ఒకవస్తు వున్నదన్నారు. అనేకకారణములచేతనున్ను ఆకాశాదులయందంతర్భా తమగుటచేత నదియుచేరదు. కొందరుఆవరణాభావము ఆకాశమన్నా రు. భావరూపముగా తోచడముచే నదియుచేరదు. మరికొందరు దీ నినైతే నిత్యమనిన్నీ నిరవయవమనిన్నీ వ్యాపకమనిన్నీ అప్రత్యక్షమనిన్నీ చెప్పినారు. భూతాదులయందు పుట్టుటచేతనున్ను అహంకారాదులు లేకపోవుటచేతనున్ను కంటికివిషయమగుటచేతనున్ను అవినాలుగుచేర వు. త్వగింద్రియములచేతను తోచుచున్నదిగాన వాయువప్రత్యక్షమ నడమున్ను చేరదు. తేజస్సు భౌమాదిభేదములచేతను బహువిధములు. అందులో ఆదిత్యాదితేజస్సుస్థిరము దీపాదితేజస్సుఅస్థిరము. తేజస్సుకు

వర్ణ మెరుపు స్పర్శమౌష్ణ్యము నీటికివర్ణము తెలుపు స్పర్శము శైత్యము. రసముమాధుర్యము భూమికిరంగున్ను రసమున్ను బహువిధములు. స్పర్శము ఇందుకున్ను వాయువుకున్ను అనుష్ణాశీతము. ఈలాగునప్రకృతి మూడువిధములనుండును.

ఈశ్వరుడు అఖిలహేయ ప్రత్యనీకానన్తజ్ఞానానందైకస్వరూపుడై జ్ఞానశక్త్యాదికల్యాణగుణగణభూషితుడై సకలజగత్సర్గస్థితిసంహారకర్తయై "ఆర్తోజిజ్ఞాసురర్థార్థీజ్ఞానీచభరతర్షభ" యన్నట్లుచతుర్విధపురుషార్థములకున్నయాశ్రయణీయుడై ధర్మార్థకామమోక్షాఖ్యచతుర్విధఫలప్రదుడై విలక్షణవిగ్రహుడై లక్ష్మీభూమినీళానాయకుడై యుండును. అఖిలహేయప్రత్యనీకుడగుటయనగా తమస్సుకుతేజస్సువలెనున్ను సర్పమునకుగరుత్మంతునివలెనున్ను వికారాదిదోషములకు ప్రతిభటమై యుండడము. అనన్తుడగుటయనగా నిత్యుడై చేతనాచేతనములకువ్యాపకుడై యన్తర్యామిగానుండడము. అంతర్యామియగుటచేదోషములు రావా యనగా శరీరగతములైనబాల్యాదులుజీవునికిరాకపోవుటవలెత్రివిధచేతనాచేతనులయొక్కదోషములుఈశ్వరునికిరానేరవు. జ్ఞానానందైకస్వరూపుడగుటయనగా ఆనందరూపజ్ఞానుడై యుండడము. అదేమంటేతగునట్లుయనుకూలమై ప్రకాశమయమైయుండడము. ఇతనియొక్క జ్ఞానశక్త్యాదికల్యాణగుణములునిత్యములై నిస్సీమములై నిసంఖ్యములై, నిరుపాధికములై, నిర్దోషములై, సమానాధికరహితములై, యుండును. వీటిలోవాత్సల్యాదులకువిషయము అనుకూలులు. శౌర్యాదులకువిషయముప్రతికూలులు. వీట్లకుకారణమైనజ్ఞానశక్త్యాదులకందరు విషయము జ్ఞానమజ్ఞానులకు శక్తియశక్తులకు క్షమసాపరాధులకు కృపదుఃఖవంతులకు వాత్సల్యముదోషముగలవారికి శీలము మందులకు ఆర్జవము కుటిలులకు సౌహార్దము దుష్టహృదయులకు మార్దవము విశ్లేషభీరులకు సౌలభ్యము చూడుట కిచ్ఛగలవాళ్లకు ఈలాగున

సర్వత్రి తెలిసికొనేది. ఈలాగున ఈశ్వరుడు కల్యాణగుణములతో కూడియుండుటచే ఇతరులు బాధపడితె అయ్యో యని ప్రేమించి వారల కెప్పుడున్ను సమానమైన మంచితనమును యోచించుకొని తనదేమైన నదానిని తనకున్ను యితరులకున్ను కలిసినదానిని చేయక వెన్నెల మలయమారుతము, గంధము, నీరు వీటివలె పరులకేమై దన్నాశ్రి యించినవారలయందు జన్మజ్ఞానవృత్తములచేతను గలిగిన హెచ్చుతగ్గు లనుచూడక తాను యితరులు రక్షకులుగాకపోయినప్పుడు తాను రక్ష కుడై సాందీపునిపుత్రునిన్ని, వైదికనిపుణులన్ను విడిపించుకొనివచ్చి నట్లుగానే అతిలోకచర్యలనుచేసి వారియపేక్షితములను పూర్తిచేసి వారలకు ధ్రువపదమువలె మునుపులేనివాటిని గలుగచేసిన్ని తనసా త్తును తానే వినియోగముచేసికునేవాడు వలెయుండడమున్ను, తన్నున్ను దనసొత్తున్ను వదలి వారలకార్యమును పూర్తిచేసెనే కృతకృత్యుడై దాను చేసినయుపకారములను దలచకనే అనాదికాలముగానున్నటువంటి రసములను మరిచేలాగున అన్నిదశలయందు స్నేహితుడై భార్యాపు త్రిలదోషములను చూచీచూడకయుండు పురుషునివలె వారిదోష ములను మనస్సులోనెంచక దోషములను పెద్దమహిషి గనపరచిన ప్పటికిన్ని యామెతో బదులుచెప్పి సమర్థుడైయుండి రక్షించి కామిని యొక్క సౌందర్యమునకు మోహపడే కాముకునివలె వారలదోషము లను భోగ్యముగాగ్రహించి వారలయందు కరణత్రియము కోటి చేసే వాడై యెడబాసినట్టె వారల వ్యసనము గరిబాడచిన విధముగా దా నేపొంది వార్లకు శుభమయ్యేటట్టు తనను భృత్యునిగాచేసికొని వారలకు కట్టడమునకున్ను కొట్టడమునకున్ను యనుకూలమయ్యేలాగున సులభు డై ఆరోజున వేసినమాడకు తల్లి ప్రేమించి పశువు వెనుకటిమాడున్ను, గడ్డివేయులకువచ్చిన వార్లనున్న కొమ్ములతోను కాళ్ళతోను హింసిం చునట్టువలె పెద్దమహిషినిన్ని నిత్యసూరులనున్ను విడచిన్నేహముగత్తి

యుండును. ఇతడేసకలజగత్తుకు కారణభూతుడు. కొందరు పరమాణువ్రులుకారణమనిచెప్పినారు. పరమాణువులలో ప్రమాణములేకపోవుటచేతనున్ను శ్రుతివిరోధముచేతనున్ను యదిచేరదు. కాపిలమతస్థులు ప్రకృతికారణముగాచెప్పినారు. ప్రకృతి యచేతనమగుటచేతనున్ను ఈశ్వరుడధిష్ఠించనపుడు పరిణమింపచాలకపోవుటచేతనున్ను సృష్టిసంహారవ్యవస్థలుకూడకపోవుటచేతనున్నుయదియుచేరదు. జీవుడున్ను కారణుడుగాడు. కర్మపరతంత్రుడై సదుఃఖుడై యుండుటచేతను. కాబట్టి ఈశ్వరుడేజగత్తుకు కారణము. ఇతడుకారణముగావడము అవిద్యాకర్మపరనియోగాదులచేతగాక స్వేచ్ఛచేతను స్వసంకల్పముచేతనుచేయుటచే ఇదే కష్టములేకుండును. ఇందుకుప్రయోజనము కేవలలీల అయితే సంహారములో లీలనశించదాయనగా సంహారమే లీలయగుటచే నశించదు. ఇతడుతానేజగత్తైపరిణమించుటచే ఉపాదానకారణమైయుండును. అయితే నిర్వికారమనగాయేమంటే; స్వరూపమునకు వికారములేకపోవుటయే. అయితేపరిణామముండడమేమంటే విశిష్టవిశేషణసద్వారకముగా ఒకసాలిపురుగుకుగల్గినస్వభావము సర్వశక్తిగలవాడికియుండకపోదుగదా ఈశ్వరుడు సృష్టియనగా ప్రకృతినిపరిణమింపచేయడము, జీవులకు శరీరేంద్రియములనిచ్చిజ్ఞానవికాసముచేయడము, స్థితియనగా సృజించబడిన వస్తువులయందు సస్యమునకునీరు ఆధారమువలె అనుకూలముగా ప్రవేశించిసర్వరక్షణలున్ను చేయడము సంహారమనగా అవినీతుడైనపుత్రుని తండ్రియరిదండమువేయువలె విషయాంతరములయందు మిక్కిలివృద్ధిబొందుచున్న ఇంద్రియములను నియమించియుంచడము. ఇవిమూడున్ను ప్రత్యేకప్రత్యేకమునాల్గుప్రకారములై యుండును. సృష్టియందు బ్రహ్మకున్ను ప్రజాపతులకున్ను కాలమునకున్ను సర్వజంతువులకున్ను యంతర్యామియైరజోగుణముతోకూడి సృజించును. స్థితియందు విష్ణ్వాదిరూపముచేతను అవతరించి మన్వాదిముఖముచే శాస్త్రములను ప్రవర్తింపచేసిమంచి

మార్గముచూపికాలమునకున్ను సర్వభూతములకున్ను అంతర్యామియైసత్వగుణముతోఁ నేగూడి స్థితించును. సంహారమందు రుద్రునికిన్ని అగ్నికిన్ని యమునికిన్ని కాలమునకున్ను సర్వభూతములకున్ను యంతర్యామియై తమోగుణముతోఁ కూడి సంహరించును కొందరినిసుఖులుగాను కొందరినిదుఃఖులుగాను సృజించిన ఈశ్వరునికి వైషమ్యనైర్ఘృణ్యములురావాయేమంటే కర్మకారణముగా చేయుటచేతనున్ను మన్నుతిన్నప్రజయొక్క నాలుకయందు కటువస్తువునుంచి భీతిచేయుతల్లివలె హితపరుడై చేయుటచేతనురాదు సవిగ్రహుడై సృష్ట్యాదులనుచేయును. విగ్రహమైతే స్వరూపగుణములకంటే యత్యంతాభిమతమై స్వానురూపమై నిత్యమై ఏకరూపమై శుద్ధసత్వాత్మకమై చేతనదేహమువలె జ్ఞానమయమైనస్వరూపమును కప్పడముగాకుండా మాణిక్యభరిణిలోఁ బంగారమునుంచినట్టువలెనున్న బంగారముతోఁ సమానమైన దివ్యాత్మస్వరూపమునకు ప్రకాశకమై నిరవధికతేజోరూపమై సౌకుమార్యాదికల్యాణగుణగణనిధియై యోగిధ్యేయమై సకలజనమోహనమై సమస్తభోగవైరాగ్యజనకమై నిత్యముక్తానుభావ్యమై సకలతాపహరమై యనంతావతారకందమై సర్వరక్షకమై సర్వాశ్రయమై అస్త్రభూషణభూషితమై యుండును. ఈశ్వరస్వరూపమే పరత్వము వ్యూహము విభవము అంతర్యామిత్వము అర్చావతారమని అయిదు ప్రకారములతోఁ కూడియుండును. అందులో పరత్వమనగా అకాలకాల్యమైననిత్యముక్తులకుభోగ్యుడై వేంచేసియుండడము. వ్యూహమనగా సృష్టిస్థితిసంహారార్థమునకున్ను సంసారిసంరక్షణార్థమునకున్ను ఉపాసకానుగ్రహార్థమునకున్ను సంకర్షణ ప్రద్యుమ్నా నిరుద్ధరూపములచే ఉండడము పరత్వములో జ్ఞానాదులారున్ను పూర్ణమై యుండును. వ్యూహములో ఈరెండుగుణములు ప్రకటమైయుండును. అందులోసంకర్షణుడు జ్ఞానబలముల రెండిటితోఁ గూడి జీవతత్వము నధిష్ఠించి దానిని ప్రకృతిలోనుండి వివేకించి ప్రద్యుమ్నావస్థనుబొంది శాస్త్రప్రవర్తనమునున్ను,

జగత్సంహారమునున్ను, చేయువాడుగానుండును. ప్రద్యుమ్నుడు ఐశ్వర్యవీర్యములు రెంటితోఁ గూడి మనస్తత్త్వము నధిష్ఠించి ధర్మోపదేశమునున్ను మనుచతుష్టయము మొదలగు శుద్ధవర్గసృష్టియున్ను చేయువాడగును. అనిరుద్ధుడు శక్తితేజస్సులు రెంటితోఁ గూడి రక్షణమునకున్ను తత్త్వజ్ఞానప్రదానమునకున్ను కాలసృష్టికిన్ని మిశ్రసృష్టికిన్ని చేయువాఁడుగానుండును. విభవము లనంతములై గౌణముఖ్యభేదములచే భేదించియుండును. మనుష్యత్వము, తిర్యక్త్వము, స్థావరత్వమువలె గౌణత్వము ఇచ్ఛచేత వచ్చినది. స్వరూపముచేఁ గాదు. అందులో అప్రాకృతవిగ్రహములై అజహత్స్వభావములై దీపాదుత్పన్నప్రదీపమువలె యుండి చేయదగిన ముఖ్యప్రాదుర్భావములన్నిన్ని ముముక్షువుల కుపాస్యములై యుండును. విధి, శివ, పావక, వ్యాస, జామదగ్న్యార్జునవిత్తేశాదులనే గౌణప్రాదుర్భావములన్నియు అహంకారయుక్తజీవులను అధిష్ఠించి యుండుటచే ముముక్షువుల కనుపాస్యులు. నిత్యోదిత శాన్తోదితాది భేదము జాగ్రత్సంజ్ఞాదియైన చాతురాత్మ్యము కేశవాదిమూర్త్యంతరము షట్త్రింశద్భేదభిన్నమైన పద్మనాభాదివిభవము ఉపేంద్ర, త్రివిక్రమ, దధిభక్త, హయగ్రీవ, నరనారాయణ, హరి, కృష్ణ, మత్స్య, కూర్మ, వరాహాద్యవతారవిశేషములు, వాట్లయొక్క భుజాయుధవర్ణకృత్యస్థానాది భేదములు, దురవధార్యములై గుహ్యతమములై యుండుటచే చెప్పలేదు. అవతారములకు కారణము ఇచ్ఛ ఫలము సాధుపరిత్రాణాదిత్రయము. అనేకప్రమాణములచేతనున్ను భృగుశాపాదులచేతను పుట్టినవాఁడగుటవలన అవతారములకు కారణము కర్మగావద్దాయుంటే వాటియందు శాపము మిషయని యవతారమైచ్ఛికమని పరిహరించబడినది. అంతర్యామిత్వమనగా అన్తర్యామియై నియామకుడై యుండడము. స్వర్గ నరకప్రవేశాదిసర్వావస్థలయందును సమస్తజీవులకు సహాయమై వారలను విడువకయుండేయునికిమీఁద శుభాశ్రయమైన శరీరముతోఁ గూడుకొని

వార్లకు ధ్యేయుడగుటకును వార్లను రక్షించే నిమిత్తమున్ను బంధుభూతుడై హృదయఫలకమందు వేంచేసియుండడము. అర్చావతారమనగా జీవులకభిమతమైన ద్రివ్యమందు విభవవిశేషములవలెగాకనే దేశకాలాధికారనియమములేక సాన్నిధ్యముచేసి యపరాధములనుచూచిచూడక యర్చకపరతంత్రమైన సర్వవ్యాపారములను గల్గినవాడై యుండి దేవాలయములలోను గృహములలోను వేంచేసియుండేతేజస్సు. రుచిజనకత్వమును శుభాశ్రియత్వమును అశేషలోకశరణ్యాత్వమును అనుభావ్యత్వమున్ను ఇవియన్నీ యర్చావతారమునందు పరిపూర్ణము స్వస్వామిభావమును మార్పుచేసి అజ్ఞులవలెనున్ను అశక్తులవలెనున్ను అస్వతంత్రులవలెనున్ను ఉన్నట్టుచేసినప్పటికిన్నీ యపారకారుణ్యాపరవశుడై సర్వాపేక్షితములను దయచేయును.

---

నవవిధసంబంధప్రకరణము.

---

శ్లో॥ పితాచరక్షకశ్శేషీభర్తాజ్ఞేయో రమాపతిః
స్వామ్యాధారో మమాత్మాచ భోక్తాచాద్యమనూదితః॥

అనునట్లు ఆకారముచేతను పితాపుత్రసంబంధమును చెప్పి, 'అవరక్షణే' యను ధాతువుచేత రక్ష్యరక్షకసంబంధమును చెప్పి; లుప్తచతుర్థిచేత శేషశేషిసంబంధమును చెప్పి ఉకారముచేత భర్తృభార్యా సంబంధమును చెప్పి, మకారముచేత జ్ఞాతృజ్ఞేయసంబంధమును చెప్పి, నమస్సుచేత స్వస్వామిసంబంధమును చెప్పి, నారపదముచేత శరీరశరీరిసంబంధమునుచెప్పి, అయనపదముచేతను ఆధారాధేయసంబంధమును చెప్పి, అయిపదముచేత భోక్తృభోగ్యసంబంధమును చెప్పి ఇట్లు తిరుమంత్రముచేతను నవవిధసంబంధమును చెప్పి, పూర్తిచేయుడది. మనపూర్వాచార్యులు ప్రథమమునాస్యతాత్పర్యమైన నవవిధసంబం

ధము, స్వరూపజ్ఞులకు నిత్యానుసంధేయమని యనుసంధించి యుప దేశించిరి. అవియేవియనగా, విశేషణవిశేష్యసంబంధము, రక్ష్యరక్షక సంబంధము, శేషశేషిసంబంధము, భర్తృభార్యాసంబంధము, జ్ఞాతృజ్ఞేయసంబంధము, స్వస్వామిసంబంధము, శరీరశరీరిసంబంధము, ధార్యధారకసంబంధము, భోక్తృభోగ్యసంబంధము, వీటిలో విశేషణవిశేష్య సంబంధము; పరికృత్యర్థశంకానివర్తకమై, ఆశ్రియాశ్రియిత్వమై, వ్యావర్త్యవ్యావర్తకమై యుండుట. పరికృత్యర్థశంకానివర్తకమనగా, సమస్తశబ్దకారణమైన అకారస్వభావముచేత తద్వాచ్యమున్ను, సమస్తశబ్దవాచ్యమైన జీవపరికృతులకు కారణమైనవోట నిత్యములు, కార్యమైనవోట యనిత్యములౌనే యను సంశయముపుట్ట యవి నిత్యబరిహ్వావిశేషణములగుటచేత యనిత్యత్వమున్ను శంకనీయము కాదనిన్ని పరిహరించడమవును. ఆశ్రియాశ్రియియనగా, శౌక్యము పటమునుగూర్చి నిలవక యుండుటవలె జీవపరికృతులు భగవత్స్వరూపమునుగూర్చి సత్తులేకుండుట. వ్యావర్త్యవ్యావర్తకమగుట యనగా, ఇవి భగవత్స్వరూపమునకు గల్గిన ఇతరవ్యావృత్తికి పరికాశకమై, వ్యావర్త్యమైన భగవత్స్వరూపము వ్యావర్తకమైన వీట్లనుగాక పరికాశింపకయుండుట. ఇట్లు నిత్యకాల్యా నాదిత్వసూచక మీసంబంధము. రక్ష్యరక్షకసంబంధమనగా, ధాతుసిద్ధమై పరికృత్సర్థాన్తరభావిత్వమై, యుభయస్వరూపోచితమై యుండేది. ధాతుసిద్ధమనగా, అవరక్షణె, యనుధాత్వర్థమైన రక్షణము. నిర్విషయముగాను, నిరాశ్రయముగాను, నిలవకపోవుటచేత, 'యేనజాతానిజీవన్తి', ఇత్యాదిప్రసిద్ధమైన రక్ష్యరక్షకస్వరూపదర్శనమగుట, పరికృత్యర్థాన్తరభావిత్వమగుట యనగా, పరికృత్యర్థమైన కారణత్వమునకు తర్వాత కావల యుననుట. ఉభయస్వరూపోచితమగుట యనగా, రక్ష్యరక్షక స్వరూపమైన పారతంత్ర్యస్వాతంత్ర్యములకు చేయుట. పరతంత్రునికి స్వరక్షణాన్వయముగూడదనుటను చూపించు నీసంబంధము. శేషశేషిసంబంధ

మనగా, విభక్తిసిద్ధమై, ధాత్వర్థపరార్థతాప్రకాశకమై, భోగ్యానురూప తాదర్శకమై యుండునది. విభక్తిసిద్ధమనగా, అకారమందు లోపించిన చతుర్థియందు పుట్టిన శేషత్వము, 'యస్యాస్మి' ఇత్యాదిప్రసిద్ధమైన శేషశేషిలను కనపరచుట. ధాత్వర్థపరార్థతాప్రకాశక మగుటయనగా, ధాత్వర్థమైనరక్షణము. శరీరియైన శేషియొక్క ప్రయోజనమని కనపరచుట. భోగానురూపతాదర్శకమగుట యనగా, శేషవస్తుస్వరూపము శేషివినియోగానుగుణమై యుండుటకే యున్న శేషమని కనపరచుట, యనగా శేషశేషిత్వమును నశింపచేయక యుండుటను వినియోగించుటయందు వెనుకతీయని యధ్యవసాయముగలది. స్వగతస్వరూపగుణములున్ను సహించని యొకసంబంధము. భర్తృభార్యాసంబంధమనగా, ఉకారసిద్ధమై, విభక్త్యర్థశోధకమై, స్వరూపప్రాప్తమై యుండేది. ఉకారసిద్ధమగుట యనగా, ఉకారార్థమైన అవధారణార్థమై యుండుట. అనగా, రక్షకుడైన పురుషోత్తమునకే రక్ష్యమైన యాత్మస్వరూపముండునని తోచుట, విభక్త్యర్థశోధకమగుటయనగా, పతివ్రతయొక్క శేషత్వము. అనన్యార్హమైయుండునటువలె లుప్తచతుర్థ్యర్థమైన భగవచ్ఛేషత్వమును, అనన్యార్హమనిన్ని వేరుపరచుట స్వరూపప్రాప్తమగుట యనగా భర్తృభార్యాత్వములు పుంస్త్రీత్వమునకు సమమగువలె భర్తృభార్యాసంబంధము స్వాతంత్ర్యపారతంత్ర్యములకు సమమగుట. అనన్యార్హప్రసంగాసహ సంబంధము జ్ఞాతృజ్ఞేయ సంబంధమగుట యనగా మకారదృశ్యమై ఉకారార్థానుసంధానాపేక్షితమై యచిద్వ్యావృత్తివేషమై యుండేది. మకారదృశ్యమగుటయనగా 'మనజ్ఞానే' యనే జ్ఞానవాచియైన మకారము కనబడే జ్ఞాతృత్వమునకు జ్ఞేయము భగవత్స్వరూపాదులుగాతోచుట. కారార్థానుసంధానాపేక్షితమగుటయనగా ఉకారార్థమైన భర్తృభార్యాసంబంధానుసంధానమునకు జ్ఞాతృత్వమపేక్షితమగుట, అచిద్వ్యావృత్తివేషమగుటయనగా ఈసంబంధ

ములను తెలుసుకొనుటయున్ను, జ్ఞేయజ్ఞాతయగుటయున్ను, జ్ఞేయా ధీనమై తత్ప్రయోజనమైయుండు ఈజ్ఞాతృత్వమని ఈసంబంధము గనపరచును. స్వస్వామిసంబంధమనగా, నమశ్శబ్దతాత్పర్యమై, మకారార్థనిబంధనభ్రమనాశకమై, స్వాభావికమై యుండేది. నమశ్శబ్ద తాత్పర్యమగుటయనగా నమశ్శబ్దార్థమైన అహంమ్మమతానివృత్తి ఫలత్వాభిమానత్వములున్ను స్వగతముగాదు, పరగతము అనిచూపి ఫలితమై అభిమానీయమైన భగవంతునిదిగాతోచుట. మకారార్థనిబంధన భ్రమనాశకమగుటయనగా మకారార్థమైన జ్ఞాతృత్వనిబంధనమైవచ్చిన కర్తృత్వభ్రమను బోగొట్టుకొనుట. అదేమనగా, పరాధీనమైన స్వరూపముయొక్క గుణవిశేషములున్ను పరాధీనమని స్వాధీనతాప్రతిపత్తిని చెరుపుట. స్వాభావికమగుటయనగా యహంకారాదులవలె యుండుటయుగాక "స్వత్వమాత్మనిసంజాతం స్వామిత్వం బ్రహ్మణిస్థితం" యనుటవలె జీవపరులయొక్క స్వస్వామిసంబంధము స్వతసిద్ధమైపొందుట స్వత్తుకు స్వరక్షణకర్తృత్వము లేదనిన్ని స్వామికేయధికారమని గనపరచుచున్నది. శరీరశరీరిసంబంధమనగా నారాయణపదములో సమానవిశేషసిద్ధమై నమశ్శబ్దార్థస్వరూపప్రకాశమై సమానాధికరణ్యయోగ్యమై యుండేది. సమానవిశేషసిద్ధమగుట యనగా నారాయణపదమందు బహువ్రీహిసమాసములో వ్యాప్యమైననారములు శరీరమై యన్తర్వ్యాప్తిచేత వ్యాపకస్వరూపము శరీరియైకనబడుట. నమశ్శబ్దార్థస్వరూపప్రకాశమగుటయనగా నమశ్శబ్దార్థమైన స్వస్వామిసంబంధము గృహక్షేత్రాది సంబంధములవలెగాక యపృథక్సిద్ధమై యుండునని చూపుట. సమానాధికరణ్యయోగమగుటయనగా స్వరూపభేదముచేత భిన్నప్రవృత్తినిమిత్తమయిన జీవపరస్వరూపము శరీరశరీరియైన యైక్యముచేత ఒకటియని యెంచుట. ఈసంబంధము విశిష్టాద్వైత ప్రకాశకము. ధార్యధారకసంబంధమనగా సమానాంతరసిద్ధమై, శరీరశరీరిసంబంధైకలక్ష

ణమై, యచిద్విశేషస్థితికారణమై యుండేని. సమానాంతరసిద్ధమగుట యనగా నారాయణపదమునందు తత్పురుషసమాసనసిద్ధమైన బహిర్వ్యాప్తిచేత నారపదవాచ్యములుధార్యమై అయన పదవాచ్యముధారకుడై తోచుట. శరీరశరీరిసంబంధైక లక్షణమగుటయనగా ఆధేయత్వ విధేయత్వ శేషత్వరూపమైన శరీరరక్షణములయందును ఆధారత్వ విధాయకత్వ శేషిత్వరూపమైన శరీరిలక్షణములయందును ప్రధానమైన యాధేయత్వ ధారకత్వరూపలక్షణము లొకటిగా దోచుట. అచిదవిశేషత్వస్థితిహేతువగుట యనగా "అనేనజీవే నాత్మనానుప్రవిశ్యనామరూపే వ్యాకరణవాణి" యని అంతర్వ్యాప్తివలె చేతనస్థితి ప్రధానమగుటగాక బహిర్వ్యాప్తిచేత చేతనాచేతనములు రెంటియొక్క వ్యవస్థితస్వరూపస్థితి వ్యాపారములకు కారణమై దోచుట. చిదచిన్నిత్యకారణ మీ సంబంధము. భోక్తృభోగ్యసంబంధమనగా చరమవిభక్తిసిద్ధమై పూర్వసంబంధప్రయోజన ప్రదర్శకమై ప్రతిసంబంధిభోగానురూపమై యుండేని. చరమవిభక్తిసిద్ధమగుటయనగా అయ యని చతుర్థీవిభక్తిచేత యనన్యార్హశేషభూతుడైన మకారవాచ్యునిసహజశేషవృత్తి దోచగా యందుకర్తృత్వభోక్తృత్వములు శరీరియైన పరమశేషికే కాని శరీరమైన శేషభూతునికిగాకయుండుట. పూర్వసంబంధప్రయోజనప్రదర్శకమగుటయనగా సర్పవిషమువలె ధార్యధారకత్వములు నిష్ప్రయోజకములు గాకపోగా రసనారసవస్తువువలె ధార్యధారకములకు అనుకూలగ్రాహ్యగ్రాహకరూప ప్రయోజనమును గనుపరచుట. ప్రతిసంబంధిభోగానురూపమగుటయనగా కైంకర్యప్రతిసంబంధియైన శేషియొక్క కైంకర్యరసానుభవమునకున్ను కైంకర్యాశ్రయమైన శేషభూతునియొక్క శేషిభోగవిరుద్ధరసత్వరాహిత్యమునకున్ను స్థానమైయుండుట. శేషిత్వము లోను శేషత్వము లోను సంబంధము ఇందులో విశేషణ విశేష్యసంబంధజానముపుట్టగా కారణాంతరశంకానివర్తియగును. రక్ష్యరక్షకసంబంధజ్ఞా

నముపుట్టగా రక్షకాంతరశంకానివర్తియగును. శేషశేషీసంబంధజ్ఞానము పుట్టగా శేష్యంతరశంకతీరును. భర్తృభార్యాసంబంధజ్ఞానము పుట్టగా అనన్యార్హశంకతీరును. జ్ఞాతృజ్ఞేయసంబంధముపుట్టగా జ్ఞేయాంతరశంకతీరును. స్వస్వామిసంబంధజ్ఞానము పుట్టగా స్వాతంత్ర్యశంకతీరును. శరీరశరీరిసంబంధజ్ఞానము పుట్టగా స్వరూపైక్యశంకతీరును. ధార్యధారకసంబంధజ్ఞానము పుట్టగా ధారకాంతరశంకతీరును. భోక్తృభోగ్యసంబంధజ్ఞానముపుట్టగా భోక్తృత్వశంకతీరును. ఇట్లు నవవిధసంబంధమును తెలుసుకొనుము.



అర్థపంచకప్రకరణము.



సంసారిచేతనునికి తత్వజ్ఞానముపుట్టి ఉజ్జీవించునపుడు అర్థపంచకజ్ఞానముకావలయును. అర్థపంచకమనగా స్వస్వరూప పరస్వరూప పురుషార్థస్వరూప ఉపాయస్వరూప విరోధిస్వరూపములను ఉన్నరీతిని తెలుసుకొనుట. వీటిలో వేకొకవిషయమే యైదువిధములుగానుండును. స్వస్వరూపమనగా ఆత్మస్వరూపమును ఆత్మస్వరూపమే నిత్యులు ముక్తులు బద్ధులు కేవలులు ముముక్షువులు అనియైదున్ను పరస్వరూపమనగా పరత్వము వ్యూహము విభవము అన్తర్యామిత్వము అర్చావతారము అనియైదున్ను పురుషార్థస్వరూపమనగా పురుషునిచేకోరబడేది పురుషార్థము. ఆపురుషార్థమే ధర్మ అర్థ కామ ఆత్మానుభవము భగవదనుభవమని యైదు. ఉపాయస్వరూపమనగా కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తి ఆచార్యాభిమానము లనియైదు విరోధిస్వరూపమనగా స్వరూపవిరోధి పరత్వవిరోధి పురుషార్థవిరోధి ఉపాయవిరోధి ప్రాప్తివిరోధి యనేయైదు. ఇందులోనిత్యులైనవారు ఒకరోజూసంసారసంబంధమైనఅవద్యములేక నే

నిరవద్యులై భగవదనుభవానుకూలైకభోగులై శ్రీవైకుంఠనాధునకు పట్టముకట్టుటకు భృత్యులై సమకూర్చుమంత్రులై ఈశ్వరాజ్ఞ చేసృష్టిస్థితి సంహారములనుచేయుటకు శక్తులై పరవ్యూహాది సర్వావస్థలయందున్ను ఆరంభించి సేవచేయువారై దేవాలయములలోనున్ను దైవములయిన విష్వక్సేనులు మొదలగుదేవతలు. ముక్తులనగా భగవత్ప్రసాదముచేతను ప్రకృతిసంబంధముచేవచ్చిన క్లేశమూలిన్యములన్నిటినివిడచి భగవత్స్వరూపరూపగుణవిభవములను అనుభవించి అనుభవజనితప్రీతిలోపల ఇమడక నోరారస్తోత్రములు చేసిశాశ్వతముగా వైకుంఠపురమందు బలేయానందించుచుండుమునులు. బద్ధులనగా పాంచభౌతికమై అనిత్యమై సుఖదుఃఖానుభవపరికరమై ఆత్మవిశ్లేషమందు దర్శనస్పర్శనయోగ్యములేనట్టు అశుద్ధాస్పదమై అజ్ఞానాన్యథాజ్ఞాన విపరీతజ్ఞానజనకమైన స్వదేహమే యాత్మయనిన్ని శబ్దాదివిషయానుభవజనితమైన స్వదేహపోషణమే పురుషార్థమనిన్ని శబ్దాదివిషయలాభమునకు గుర్తుగావర్ణాశ్రమధర్మములును విడుచువిధమున్ను అసేవ్యసేవనచేసిన్ని భూతహింసచేసిన్ని పరదారపరద్రవ్యాపహారములు చేసిన్ని సంసారవర్ధకులై భగవద్విముఖులైనచేతనులు. కేవలులనగా ఏకాంతమైనస్థలమునందు దిక్కులియాకలిదప్పికచే బాధపడినవాడు భక్ష్యాభక్ష్యవివేకముచేయజాలక తనశరీరమునుతానేజీవింపచేసికొని ప్రసన్నుడైనట్టువలె సంసారదావాగ్నిచే తప్తుడైనవాడు సంసారదుఃఖనివృత్తికితగునట్లుగా శాస్త్రజన్యజ్ఞానముచే ప్రకృత్యాత్మవివేకముచేసి ప్రకృతిదుఃఖాశ్రయమై హేయపదార్థసముదాయమైయుండే ఆకారమున్ను జీవుడుప్రకృతికంటెపరుడై పంచవింశకుడై స్వయంప్రకాశించేవాడై స్వతస్సుఖుడై నిత్యుడై అప్రాకృతుడైయుండేయాకారమున్ను అనుసంధించి మునుపుతానుబద్ధ దుఃఖభారముచేత ఈయల్పరసమందు ప్రవేశించక జ్ఞానాస్పదమైన పరమాత్మవివేకముచేయజాలక అమృతప్రవాహయోగ్యతనువిడచి ఆత్మప్రాప్తికి

సాధనమైనజ్ఞానయోగమునందు నిష్ఠుడై యోగఫలమైనయాత్మానుభవమాత్రమునే పురుషార్థముగాఅనుభవించి వెనుక సంసారబంధమున్ను భగవత్ప్రాప్తియున్ను విడచి యానదాత్మభావి యశరీరియైయుండి సంచరించునటువంటివాడు మోక్షమందిచ్చగలవారలకును ముముక్షువులనిపేరు. ఇదేముముక్షువులై యుపాస్యులై యుండేవారున్ను, ముముక్షువులై ప్రపన్నులై యుండేవారైన్నీ రెండువిధములుగా ఉందురు. ఈశ్వరవిషయమందు పరత్వమనగా పరమపదమందు 'అవాక్యనాదరః' యని వేంచేసియున్న మొదటి తేజస్స్వరూపమయిన పరవాసుదేవుడు. ఊహమనగా సృష్టిస్థితిసంహారకర్తలైన సంకర్షణప్రద్యుమ్నానిరుద్ధులు. విభవమనగా రామకృష్ణాద్యవతారములు. అంతర్యామిత్వము రెండు విధములుగానుండును. అదేమనగా నేయుకలవాడనన్నీ నాసాత్తనిన్నీ నాప్రాణమనిన్నీ చెప్పరీతియాత్మలోను లక్ష్మీసహితుడై విలక్షణవిగ్రహుడై యుండి హృదయకమలమందు సకల ప్రవృత్తి నివృత్తులను న్ను సదావలోకనముచేయుచు వేంచేసియుండేవిధము. అర్చావతారమనగా తనకని ఒకఆకారమున్ను ఒకపేరున్నలేకనే యాశ్రితులు కోరినప్రకారము శరీరమును ధరించడమున్ను వార్లుఉంచినదే పేరుగానున్ను సర్వజ్ఞుడైనప్పటికి యజ్ఞునువలెనున్ను సర్వశక్తుడైనప్పటికి యశక్తునువలెనున్ను అవాప్తసమస్తకాముడైనప్పటికీ సాపేక్షునువలెనున్ను రక్షకుడైనప్పటికి రక్ష్యమువలెనున్ను స్వస్వామిభావమును నటించుచు కంటికి విషయమయ్యేలాగున సర్వసులభుడై దేవాలయములలోను గృహములలోను దేశకాలావధిలేకనే వేంచేసియుండుట. పురుషార్థములో ధర్మమనగా ప్రాణరక్షణమునకు గుప్తగాచేయు వృత్తివిశేషములు. అర్థమనగా వర్ణాశ్రమానురూపముగా ధనధాన్యములను సంగ్రహించి దేవతావిషయములలోనున్ను పైతృకకర్మలలోనున్ను ప్రాణులవిషయములోరకున్ను ఉత్కృష్టమైన దేశకాలపాత్రలను తెలిసి ధర్మబుద్ధ్యా

ప్రవర్తించుట. కామమనగా ఐహికలౌకికముగాను పారలౌకికముగాను ద్వివిధమైయుండును. ఇహలోకమందు కామమనగా పితృ,మాతృ, రత్న, ధన, ధాన్య, వస్త్రాన్నపాన, పుత్ర, మిత్ర, కళత్ర, పశు, గృహ క్షేత్ర, గంధ, పుష్ప, తాంబూలాది పదార్థములు శబ్దాదివిషయానుభవముచేతవచ్చిన సుఖవిశేషములు. పరలోకమందు కామమనగా ఇందులో విలక్షణమై తేజోరూపమైన స్వర్గాదిలోకములలో ప్రవేశించి అచట దాహము, దుఃఖము, మోహము, జరామరణాదులులేకనే యార్జితపుణ్యమునకు తగినట్లు అమృతపానముచేసి అప్సరసలతో శబ్దాదివిషయానుభవముచేయుట. ఆత్మానుభవమనగా దుఃఖనివృత్తిమాత్రమైన కేవలాత్మానుభవముమాత్రమున్ను మోక్షమనిచెప్పుదురు. ఇక భగవదనుభవరూపమైన పరమపురుషార్థలక్షణమేక్రమమనగా ప్రారబ్ధకర్మశేషమై అవశ్యమనుభావ్యమైన పుణ్యపాపములునశించి అస్తి జాయతే పరిణమతే వివర్ధతే అపక్షీయతే వినశ్యతే యనునట్లు షడ్భావవికారాస్పదమై తాపత్రయాశ్రయమై భగవత్స్వరూపమును మరిపించి విపరీతజ్ఞానమును పుట్టించునదై సంసారవర్ధకమైన స్థూలశరీరము నుపేక్షతో బోగొట్టి సుషుమ్నానాడిచే శిరఃకపాలమును భేదించి బయలుదేరి సూక్ష్మశరీరముతో యమలోకదాటిపట్టిసూక్ష్మశరీరమునున్ను వాసనారేణువునున్ను విరజాస్నానముచే కడిగి సకలతాపములు పోయేలాగు అమానవకరస్పర్శమును బొంది శుద్ధసత్వాత్మకమై, పంచోపనిషన్మయమై, జ్ఞానానందజనకమై, భగవదనుభవైకపరికరమై, తేజోరూపముగా ప్రజ్వలించునట్టి యప్రాకృత విగ్రహమునుబొంది నిరతిశయానందమైన తిరుమామణిమంటపమును చేరి లక్ష్మీసహితుడై శ్రీభూమీనీళానాయకుడై విలక్షణవిగ్రహయుక్తుడైన శ్రీవైకుంఠనాథుని నిత్యానుభవముచేసి నిత్యకింకరస్వభావుడగుట. ఉపాయములో కర్మమేమనగా యజ్ఞ, దాన, తపో, ధ్యాన, సంధ్యావందన, పంచమహాయజ్ఞాగ్నిహోత్ర తీర్థయాత్ర పుణ్య

క్షేత్రవాస కృచ్ఛ్రచాంద్రాయణ పుణ్యనదీస్నాన వ్రత చాతుర్మాస్య ఫలమూలాశన శాస్త్రాభ్యాస సమారాధన జప తర్పణాదికర్మానుష్ఠానాదులచేవచ్చిన కాయశోషణము చేతను పాపనాశమును పొందియుండుటచే ఇంద్రియద్వారా ప్రసరించుచున్న ధర్మభూతజ్ఞానమునకు శబ్దాదివిషయము లేకపోవుటచే విషయసాపేక్షములభించి యమ, నియమాసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధిరూపమైన యష్టాంగయోగక్రమముచే యోగాభ్యాసకాలమువరకును జ్ఞానమునకు ఆత్మను విషయముగా చేయుట. ఇదే జ్ఞానయోగమునకు సహకారియై ఐశ్వర్యమునకు ప్రధాన సాధనమై యుండును. జ్ఞానయోగమనగా ఈలాగు యోగజన్యమైన జ్ఞానమునకు హృదయకమలము. ఆదిత్యమండలము మొదలైన స్థలవిశేషములలో వేంచేసియుండే సర్వేశ్వరునివిషయముగాచేసి ఆవిషయముతన్ను శంఖచక్రగదాధరమై, పీతాంబరయుక్తమై, కిరీటాదినూపురాంత దివ్యభూషణాలంకృతమై, లక్ష్మీసహితముగా అనుభవించి యోగాభ్యాసక్రమముచే అనుభవకాలమువృద్ధిచేసి యనవరత భావనారూపముగా చేయుట. ఇదే భక్తియోగమునకు సహకారియై కేవలమోక్షమునకున్ను ప్రధానసాధనమైయుండును. భక్తియోగమనగా ఈలాగు తైలధారావదవిచ్ఛిన్న స్మృతిసంతానరూపమైన యనుభవము ప్రీతిరూపాపన్నము చేయుటయును అది తన్ను చూచినపుడు ప్రారబ్ధకర్మముపోవుటయును సాధనసాధ్యముల ననుసంధించి దానికిసంకోచవికాసమగునట్లు పరిణమింపచేయుట. ప్రపత్త్యుపాయమనగా ఈలాగుకర్మజ్ఞానసహకృతమైనభక్తియోగమందశక్తులకు అప్రాప్తులకున్ను సుకరమై శీఘ్రఫలప్రదమై ఉపాయముసకృత్తగుటచే ఉపాయానుష్ఠానసమనంతరముగలుగచేయునటువంటి భగవద్విషయానుభవములెల్లను ప్రాప్త్యకోసెను నివేములగుటచే స్వరూపానురూపముగానుండును. ఇదే ఆర్తరూపప్రపత్తియనిన్ని దృప్తరూపప్రపత్తియనిన్ని రెండువిధములుగానుండును.

ఆర్త్రరూపప్రపత్తియనగా నిర్హేతుకభగవత్కటాక్షము మొదలై నశాస్త్రాభ్యాసముచేతనున్ను సదాచార్యోపదేశముచేతనున్ను యథార్థజ్ఞానము పుట్టినవెంటనే భగవదనుభవమునకు విపరీతమైన దేహసంబంధమున్ను దేశసంబంధమున్ను దేశికునియొక్కసహవాసమున్ను దుస్సహమై భగవదనుభవమునకు ఏకాంతమగునట్లుగా విలక్షణమైనదేహమునున్ను దేశమునున్ను దేశికునిన్ని పొందడమందు తొందరఅధికమై పూర్ణప్రతిపత్తిచేసియుండడము. దృప్తరూపప్రపత్తియనగా శరీరాన్తరప్రాప్తిలోనున్ను స్వర్గనరకానుభవములోనున్ను విరక్తియు భీతియుగల్గి దానియొక్కనివృత్తికిన్ని భగవత్ప్రాప్తికిన్ని దృఢమైన సదాచార్యోపదేశక్రమముచే ఉపాయస్వీకారముచేసి విపరీతప్రవృత్తిని వృత్తులై వేదవిహితమైనవర్ణాశ్రమానుష్ఠానము భగవద్భాగవతకైంకర్యము మానసవాచకకాయకములచే యథాశక్తిననుష్ఠించి ఈశ్వరుడు శేషియై నియంతుడై స్వామియై శరీరియై వ్యాపకుడై ధారకుడై రక్షకుడై భోక్తుడై సర్వజ్ఞుడయి సర్వశక్తుడయి సర్వసంపూర్ణుడయి అవాప్త సమస్తకాముడయి యుండే యాకారమునున్ను తాను వానికి శేషమై నియామ్యమయి స్వమ్మై శరీరమయి వ్యాప్యమయి ధార్యమయి రక్ష్యమయి భోగ్యమయి అజ్ఞుడయి అశక్తుడయి అపూర్ణుడయి సాపేక్షుడయియుండే యాకారమును అనుసంధించి సర్వభరములనున్ను వానియందేయుంచి నిర్భరుడయియుండుట. ఆచార్యాభిమానమనగా ఇందులో ఎందుకును అశక్తుడయియుండు ఒకనిని గురించి వీనియొక్కయశక్తినిన్ని వీనివిషయమై ఈశ్వరునికి గలిగిన ప్రీతిననుసంధించి స్తనంధయప్రజకు వ్యాధిసంభవించినట్టైనా యది తనయొక్కకొదువయనితలచి అవుషధసేవచేసేతల్లివలె వీనికిగాను దానుపాయానుష్ఠానముచేసి రక్షించేశక్తిగల పరమదయాళువయిన మహాభాగవతునియొక్క యభిమానములో నొదిగియుండే సకలప్రవృత్తినివృత్తులనున్ను వాడుఇచ్చినపనులన్నియు స్వామిప్ర

త్యేకముగాయుండి నిత్యసిద్ధప్రాప్యుడుగాయుండునప్పుడున్ను సకలదేవ తాంతర్యామియయి ప్రాప్యుడగుటనలె ఈఆచార్యాభిమానమున్ను ప్రత్యేకముగా ఉపాయమయియున్నప్పటికిన్ని అన్ని యుపాయములకు సహకారిగా స్వతంత్రములుగాయుండును. విరోధివర్గమునందు స్వరూపవిరోధియనగా దేహాత్మాభిమానము అన్యశేషత్వము స్వస్వాతంత్ర్యము. పరత్వవిరోధియనగా దేవతాంతర పరత్వప్రతిపత్తియు సమత్వప్రతిపత్తియు క్షుద్రదేవతావిషయమందు శక్తియోగప్రతిపత్తియు అవతార విషయమందు మానుషప్రతిపత్తియు అర్చావతారవిషయమందు అశక్తియోగప్రతిపత్తియును. పురుషార్థవిరోధియనగా పురుషార్థాంతరములయం దిచ్ఛయును తానుకోరిన భగవత్కైంకర్యములయందిచ్ఛయును. ఉపాయవిరోధియనగా ఉపాయాంతరవైలక్షణ్యప్రతిపత్తియును ఉపాయలాఘవమును ఉపేయగౌరవమును విరోధిబాహుళ్యమును. ప్రాప్తివిరోధియనగా ప్రారబ్ధశరీరసంబంధమై యనుతాపశూన్యమై, గురువై, స్థిరమై, యుండేభగవదపచారము భాగవతాపచారము అసహ్యాపచారము ఇవన్నిటికిన్ని విరోధియని పేరు. అన్నదోషము జ్ఞానవిరోధి ఈలాగుఅర్థపంచకజ్ఞానముగలిగి ముముక్షులై, సంసారములో సంచరించు చేతనునికి మోక్షముసిద్ధించేవరకు సంసారము అతిశయించకయుండునట్లు కాలక్షేపముచేయు క్రమము వర్ణాశ్రమానురూపముగాను, వైష్ణవత్వానురూపముగాను అశనాచ్ఛాదనములను సంపాదించి "యదన్నః పురుషోభవతి తదన్నాస్తస్య దేవతాః" యనునట్లు సకలపదార్థములను భగవంతునియందే నివేదనచేసి యథాశక్తి భాగవతకించిత్కారమున్ను చేసి దేహధారణమునకుమాత్రము ప్రసాదప్రతిపత్తితో జీవించుటయును శ్రేష్ఠమయిన తత్త్వజ్ఞానముపుట్టించిన యాచార్యునిసన్నిధిలో కించిత్కారముతో అతనికి యభిమతముగా, వర్తించుటయును ఈశ్వరునిసన్నిధిలో తననీచత్వము ననుసంధించుటయును ఆచార్యుని

సన్నిధిలో తనయజ్ఞత్వము ననుసంధించుటయు శ్రీవైష్ణవుల సన్ని
ధిలో తనపారతంత్ర్యమునుననుసంధించుటయును సంసారులయెదుట తన
వ్యావృత్తి ననుసంధించుటయును ప్రాప్యమందు త్వరయును ప్రాప
కమందు అధ్యవసాయమును విరోధులయందు భయమును దేహము
నందు రుచియును ఆర్తియును స్వరూపములో యిచ్ఛయును స్వర
క్షణమం దశక్తియును ఉద్దేశ్యవిషయమునందు గౌరవమును ఉపకారవి
షయమునందు కృతజ్ఞతయును ఉత్తారకప్రతిపత్తియును అనువర్తనమును
గావలెను. ఇట్లు జ్ఞానానుష్ఠానములతో కూడి వర్తించువాడు ఈశ్వ
రునికి లక్ష్మీకంటెను నిత్యముక్తులకంటెను అత్యంతాభిమతవిషయ
మగుచున్నాడు.



ప్రమేయశేఖరప్రకరణము.

నిర్హేతుకభగవత్కటాక్షము మొదలుగా యాజ్ఞాతసుకృతముం
డును, అదిమొదలుగా అద్వేషముండును, అదిమొదలుగా భగవద్భా
గవతవిషయములో అభిముఖ్యముండును, అభిముఖ్యముండినవారే
త్యాజ్యోపాదేయ విభాగజ్ఞానముగలవారు, అందుచే సాత్వికసంభాషణ
ముండును, అందుచే సదాచార్యసమాశ్రయణ ముండును, అదియున్న
వారికే త్యాజ్యోపాదేయ నిశ్చయముండును, అదియు [illegible] ప్రా
ప్యాంతరములో వైరాగ్యము పరమప్రాప్యమందు [illegible] ను,
అనంతరము ప్రాప్యాంతరనివృత్తికిన్ని పరమప్రాప్యసిద్ధికి [illegible] మొ
దలైన సిద్ధోపాయస్వీకారముండును, అనంతరము భగవత్ప్రాప్తి యం
దుత్వరయుండును. అనంతరము 'అహంస్మరామి' యనున [illegible] ఈశ్వ
రస్మృతి విషయభూతుడై యనంతరము భూతసూక్ష్మ [illegible]

ముండును, అనంతరము పరబ్రహ్మసంసర్గముండును, తర్వాత హార్దాను గ్రహముచే మార్గవిశేషప్రకాశముండును, తర్వాత హృదయగుహానిర్గ మనముండును, అనంతరము మూర్ధన్యనాడీనిష్క్రమణముండును, అ నంతరము అర్చిరాదిమార్గగమనముండును, అనంతరము యతివా హికసత్కారముండును, అనంతరము ఆవరణాతిక్రమణముండును, అ నంతరము ప్రకృత్యతిలంఘనముండును. అనంతరము విరజాస్నానముం డును. అనంతరము సూక్ష్మశరీరవిశ్లేషముండును. అనంతరము అప హతపాప్మత్వాది గుణగణప్రాదుర్భావముండును. అనంతరము అమా నవకరస్పర్శముండును. అనంతరము భగవత్సంకల్పకల్పితమయిన దివ్య దేహప్రాప్తియుండును. అనంతరము అకాలకాల్యదివ్యదేశప్రాప్తియుం డును. అనంతరము యేరు, హ్రదము, తటస్నానముండును. తర్వాత దివ్యాలంకారముండును. తర్వాత దివ్యవిమానారోహణముం డును. తర్వాత తిల్యకాంతారప్రవేశముండును. అనంతరము దివా ప్సరసత్కారముండును. అనంతరము తిల్యగంధప్రవేశ ముండును. అనంతరము బ్రహ్మగంధప్రవేశముండును. అనంతరము అప్రాకృ తగోపురప్రాప్తియుండును. అనంతరము దివ్యనగరప్రాప్తియుండును. అనంతరము సూరిపరిషత్ప్రత్యుద్గమనముండును. అనంతరము రాజ మార్గగమనముండును. అనంతరము బ్రహ్మతేజఃప్రవేశముండును. అనంతరము దివ్యగోపురప్రాప్తియుండును. అనంతరము బ్రహ్మవేశ్మ ప్రవేశముండును. అనంతరము దివ్యమంటపప్రాప్తియుండును. అనం తరము దివ్యపారిషత్ప్రాప్తియుండును. అనంతరము సపత్నీకసర్వేశ్వ రదర్శనముండును. అనంతరము స్తుతిప్రణామాంజలి ప్రముఖ సంభ్ర మావర్తనముండును. అనంతరము పరబ్రహ్మసమీపప్రాప్తియుండును. అనంతరము పాదపీఠపర్యంకారోహణముండును. అనంతరము భగవ దుత్సంగసంగముండును. అనంతరము ఆలోకనాలాపాద్యనుభవముం

దును. అనంతరము ఆలింగనాద్యనుభవముండును. అనంతరము స్వరూపరూపగుణ విగ్రహాద్యనుభవముండును. అనంతరము అనుభవజనితప్రీతిప్రకర్షముండును. అనంతరము నానావిధవిగ్రహపరిగ్రహముండును. అనంతరము సర్వదేశ సర్వకాల సర్వావస్థోచితమైన సర్వవిధకైంకర్యముండును.






శ్రీం శ్రీయైనమః

శ్రీహయగ్రీవాయనమః

రామానుజాయనమః

# తత్త్వశేఖరము.

## మొదటి ప్రకరణము.

పుంస్పర్శక్లేశ సంభావనాగంధవిదురమై, ప్రత్యక్షాదిప్రమాణవిల క్షణమైయున్న యఖిలవేదసమూహమునకు వేదోపబృంహణములయిన స్మృతీతిహాసపురాణములకు చేయదగినది. సకలసంసారిచేతనులకు తత్వ జ్ఞానముపుట్టించడము. తత్వజ్ఞానమనగా సర్వముకంటె పరుడయిన నారాయణునికే సర్వవిధపరతంత్రులయిన సర్వజీవులకును స్వరూపాను రూపపురుషార్థమైన కైంకర్యము అనాదిగా ప్రతిబంధించుచున్న కర్మ సంబంధమును మర్దింపచేయు ఉపాయము తచ్చరణారవిందశరణాగతి యనే జ్ఞానవిశేషము. నారాయణుడు సర్వముకంటె పరుడయినట్లు ఎక్కడనగా పరత్వచిహ్నములయిన జగత్కారణత్వము, ముముక్షూ పాస్యత్వము, మోక్షప్రదత్వము మొదలయినవి యితనియందే యుండు టవలన యితడే సర్వముకంటెను పరుడు. మహోపనిషత్తులో "ఏకో హవై నారాయణ ఆసీన్న బ్రహ్మేశానః । నమేధ్యావాపృథివీననక్ష త్రాణిపోనాగ్నిర్నసూర్యః" అంగిరసోపనిషత్తులో "ఏకోహవై నారా యణ ఆసీన్నబ్రహ్మేశానః । సమునిర్ధ్యాత్వా సమచింతయత్ । తత ఏవతేధ్యానాజాయన్తేవిశ్వోహిరణ్య గర్భోగ్ని యమవరుణేంద్రాః" మరియొకయుపనిషత్తులో "ఏకోహవైనారాయణ ఆసీన్నబ్రహ్మనచ శంకరః" అధర్వనారాయణంబున "అధపురుషోహవై నారాయణోకా మయత" సుబాలోపనిషత్తులో "యస్యావ్యక్తంశరీరం యస్యాక్షరం

ఈశస్సర్వస్యజగతస్స వై నారాయణస్స్మృతః॥ బ్రహ్మసూత్రంబులో ‹‹ అశేషసర్వగతత్వ మాయామశబ్దాదిభ్యః । యచ్చకించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేపివా। అంతర్బహిశ్చతత్సర్వంవ్యాప్య నారాయణస్థితః॥” ఇత్యాదిప్రమాణప్రతిపాద్యుడు నారాయణుడు. కొందరు నారాయణశబ్దము శివపరముగా చెప్పుదురు. అట్లుచెప్పుట యుచితముకాదు. ఎందుకనగా సామవేదంబున ‹‹బ్రహ్మణోజ్యేష్ఠాయపుత్రాయురుద్రాయ” యజుర్వేద బ్రాహ్మణంబులో ౨॥ ౨॥ ‹అధవాఇదంతహీ౯నీ ప్రజాపతౌ హారఆసీత్’ సుబాలోపనిషత్తులో ‹‹లలాటాత్క్రోధజోరుద్రోత్ర్యక్షః ఖండపరశుమజీజనత్॥” ఇత్యాది ప్రమాణముల చేతను చతుర్ముఖ బ్రహ్మ ముఖలన పుట్టినవాడగుటచేతను యజుర్వేదారణములో ‹రుద్రస్య త్వేవధనురార్త్నిః। శిరఉత్పిపేష। సప్రవర్గ్యోభవత్ । తస్మాద్యస్సప్రవర్గ్యేణ యజ్ఞేనయజతే। రుద్రస్యసశిరః ప్రతిదధాతి। నైనగ్ంరుద్రఆరుకోభవతి। ఇత్యాదులచేతను ఇంద్రునివలనను పరాభవము పొందినవాడగుటచేతను, పారమాత్మికోపనిషత్తులో ‹‹ఈశోయస్మాద్వితతం వితత్యకంకం ధృతంకామహుతోజుహోతి। కకుదంకకుచ్ఛిత్వాభూయః పలాయస్వాహా’ మాత్స్య పురాణములో ‹‹యస్మాదనపరాధస్య శిరచ్ఛిన్నంత్వయామమ। తస్మాచ్ఛాపసమాయుక్తః కపాలిత్వం భవిష్యసి” ఇత్యాదులచేతను తనతండ్రియైన చతుర్ముఖ బ్రహ్మముయొక్క శిరస్సును ఛేదించినవాడగుటచేతను నారాయణశబ్దము శివపరముకాదు. అయినప్పటికిన్ని యజుర్వేదసంహితలో ‹‹సహస్రాణి సహస్రశోయేరుద్రాఅధిభూమ్యాం” ఇత్యాదులవలన రుద్రులనేకులగుటచేతను మహావాక్యములైన కారణవాక్యములలో బృహదారణ్యములో ‹‹బ్రహ్మవాఇదమేకఏవాగ్రఆసీత్” ఐతరేయోపనిషత్తులో ‹‹ఆత్మావాఇదమేకఏవాగ్రఆసీత్” ఛాందోగ్యములో ‹‹సదేవసోమ్యేదమగ్రఆసీదేకమేవాద్వితీయం” మహోపనిషత్తులో ‹‹ఏకోహవై నారాయణఆసీన్నబ్రహ్మనేశానః” అంగిరసోపనిషత్తులో ‹‹ఏకోహవై

నారాయణఆసీన్న బ్రహ్మనేశానః” చిత్తిలో “భర్తాసన్ భ్రియమాణోభి భర్తి। ఏకోదేవో బహుధానివిష్టః” సుబాలోపనిషత్తులో “యస్యావ్యక్తం శరీరం యస్యాక్షరం శరీరం యస్యమృత్యుశ్శరీరం ఏషసర్వభూతాంతరాత్మా అపహతపాప్మాదివ్యో దేవఏకోనారాయణః” ఇత్యాదిశృతి ప్రమాణప్రతిపాద్య నారాయణుడు చిదచిదాత్మక శరీరకుడగుటచేతను సర్వభూతాంతరాత్మకు డగుటచేతను అవిద్యాదిదోషగంధము లేనివాడగుటచేతను సమస్తకల్యాణగుణగణములు కలవాడగుటచేతను ఒకడగుటచేతను నారాయణశబ్దము శివపరము కాదు. ఇంతేగాక 'రిచర్ క్షయె' అనిధాతువు. రియంతేక్షయంతఇతిరాః, క్షయపదార్థములు, రాఃనభవన్తీతినరాః, నిత్యపదార్థములు అనగా నిత్యసూరులు మోక్షేచ్ఛగలవారలు ప్రకృతి మహదాదులు చేతనాచేతనసర్వపదార్థములు, ఏతేనారాః=ఈ నారములు, అయనం=స్థానము, యస్య=యవనికో, సోవా=వాడైనా లేక, ఏతేషాం=వీట్లకు, అయనం=స్థానము, యః=యెవడో, సః=వాడు, నారాయణః=నారాయణుడు. ఈప్రకారముగా మనుహారీతవ్యాసస్మృతులలోను భారతవిష్ణుపద్మపురాణములలోను నారాయణశబ్దముయొక్క వ్యుత్పత్తి ఇదేప్రకారముగా నిర్వచనముచేయబడినట్లు ముందే ప్రమాణములు వ్రాసియుంటిని. ఇంతేగాక హారీతస్మృతిలో “నతునారాయణాదీనాం నామాన్యన్యస్యకస్యచిత్ । ఏతన్నామ్నాం గతిర్విష్ణురేకఏవప్రచక్షతే। శబ్దబ్రహ్మత్రయీసర్వం వైష్ణవం తదిహోచ్యతే। దేవతాంతరశంకాతునకర్తవ్యాహివైదికై” భాల్లవేయశ్రుతిలో “నామానిసర్వాణియమావిశన్తితం వైవిష్ణుమదాహరంతి” వామనపురాణంబున “నతునారాయణాదీనాం నామ్నామన్యత్రసంభవః । అన్యనామ్నాం గతిర్విష్ణురేక ఏవప్రకీర్తితే” ఇత్యాది శ్రుతిస్మృతిపురాణములచేతను నారాయణశబ్దమైతే దేవతాంతరవాచకముకాదు. “విష్ణున్నారాయణః కృష్టః” యని నారాయణశబ్దము విష్టుశబ్దములలో ప్రయోగించుటచేతను

చతుర్ముఖబ్రహ్మరుద్రశబ్దములలో నారాయణశబ్దము ప్రయోగించక పోవుటచేతను బ్రహ్మరుద్రాదులయందు నారాయణయని సంజ్ఞ లేకపోవుటచేతను "పూర్వపదాత్సంజ్ఞాయామగః" అని పాణిని సూత్రము చేతను సంజ్ఞతోచబడినదగుచుండగా పూర్వపదమందున్న రేఫను నిమిత్తముగాచేసి అయనపదమందున్న నకారమునకు ణత్వమైనట్టయినా నారాయణయనిరూపమగుచున్నది. "ఋణాభ్యాంనోణన" అనే సూత్రమువలన "నకారణకౌరావనువర్తతే" ఇత్యాదులచేతను నారాయణశబ్దము శ్రీమహావిష్ణువునకేపేరు. అన్యుడైన శివునికి నారాయణశబ్దసంజ్ఞ లేక పోవుటవలన నారాయనయనిరూపమగును, నారాయణయనిరూపమురాదు. పద్మపురాణములో "నారాయణః పరంబ్రహ్మతత్వం నారాయణఃపరః । తస్యవిష్ణోః పరంధామ సదాపశ్యతిసూరయః । తద్విష్ణోః పరమం పదగ్ంసదాపశ్యన్తి సూరయః" పరంబ్రహ్మశబ్దవాచ్యుడు నారాయణుడని కంఠోక్తిగా శ్రుతిస్మృతిపురాణములు చెప్పచున్నవి. అయినప్పటికి "అంతర్మలినచిత్తానాం హరిభక్తిమరోచకం। చందనం పంకమగ్నానాం సూకరాణా మరోచకమ్" అనిస్మృతివలన మలినచిత్తముగలవార్లచేతను నారాయణపర మంగీకరించబడదు. ఎందుచేతనంటే "జాయమానంహి పురుషం యంపశ్యేన్మధుసూదనః। సాత్వికస్సతువిజ్ఞేయస్సవై మోక్షార్థచింతకః। పశ్యత్యేనం జాయమానం బ్రహ్మరుద్రోథవా పునః। రజసాతమసాచాస్యమానసం సమభిప్లుతః। యన్నపశ్యేజ్జాయమానం పాపినం మధుసూదనః। బ్రహ్మరుద్రోథవాపశ్యేద్రజసాతమసావృతః । సాత్వికేషుచలగ్నేషు జాతానాం విష్ణుదృక్పరా। పూజ్యః ప్రియస్తుప్రాప్యోసౌ శ్రీశోనారాయణోహరిః। తామసాదిషులగ్నేషు జాతానాం శివదృక్పరా। పూజనీయ్యః ప్రియాః ప్రాప్యారుద్రాదుర్గాగుహాదయః" ఇత్యాది ప్రమాణములచేతను తమతమజన్మలగ్నమందైన దేవతావిశేషములను బట్టి ఆయాదేవతలయందు అభిము

ఖ్యముగలవారై యుందురు. అందుచేతను ‘బుద్ధిః కర్మానుసారిణీ’ యను న్యాయమువలన నారాయణపరత్వ మంగీకరించబడదు. వారంగీకరించక పోక పోవుటవలన పరత్వమునకు లోపమువచ్చునా? రాదు. ఎందుచేతనంటే అథర్వణోపనిషత్తులో “సర్వభూతస్థమేకం నారాయణం । నారాయణ ఏవేదగ్ సర్వమ్” యజుర్వేదసంహితలో “అగ్నిరవమో దేవతానాంవిష్ణుః పరమః” ఋగ్వేదంబున “అగ్నిర్వై దేవానామవమో విష్ణుః పరమః । కృష్ణంకమలపత్రాక్షం పుణ్యశ్రవణకీర్తనం । వాసుదేవం జగద్యోనిం నౌమినారాయణంహరిం” నారాయణంబున “యస్మాత్పరం నాపరమస్తి కించిత్ । మత్తఃపరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ” ఇత్యాదిప్రమాణములచేతను నారాయణుడే పరాత్పరుడు. కాబట్టి నారాయణుడు “గీతాశాస్త్రి” వరాహపురాణములో “గీతాగంగోదకం పీత్వాపునర్జన్మనవిద్యతే । భారతామృతసర్వస్వం విష్ణోర్వక్త్రాద్వినిస్రుతం। ఏకంశాస్త్రం దేవకీపుత్రగీతమేకో దేవో దేవకీపుత్రఏవ। ఏకోమంత్రస్తస్య నామానియానికర్మాప్యేకం తస్యదేవస్యసేవా” హారీతస్మృతిలో రఘుచరితంరఘునాధస్య గీతాభగవతోహరేః” గరుడపురాణములో॥ శ్లో॥ గీతానహస్రనామానిపఠేద్వాశ్శృణుయాదపి, సర్వోపనిషదోగావో దోగ్ధా గోపాలనందనః । పార్థోవత్సస్సుధీర్భోక్తా దుగ్ధంగీతామృతంమహత్” ఇత్యాదిప్రమాణములచేతను గీతాశాస్త్రమందు, సమీరితః=చెప్పబడెను.

జ్ఞానకర్మాత్మికే నిష్ఠేయోగలక్ష్యేసుసంస్కృతే।
ఆత్మానుభూతిసిద్ధ్యర్థే పూర్వషట్కేనచోదితే॥

యోగలక్ష్యే=యోగస్వరూపమైనవియు, సుసంస్కృతే=యోగ్యముగాసంస్కరించబడినవియు, ఆత్మానుభూతిసిద్ధ్యర్థే ఆత్మ=ఆత్మయొక్క, అనుభూతి=అనుభవముయొక్క, సిద్ధ్యర్థే=పొందడమే ప్రయోజనముగాగలవియు; జ్ఞానకర్మాత్మికే=“ఉభాభ్యాం జ్ఞానకర్మాభ్యామారాధ్యోభగవాన్హరిః” అనే ప్రమాణముచేతను జ్ఞానకర్మస్వరూపమైన,

నిష్ఠే = నిష్ఠలు, పూర్వషట్కనచ = మొదటి యారధ్యాయముల చేతను న్ను, ఉదితే=చెప్పబడెను.

తాత్పర్యము॥ మొదటి ఆరధ్యాయము లయందు 'బ్రహ్మవిదా ప్నోతిపరం' అనుశ్రుతివలనమిక్కిలిపొందదగినట్టియు, "నారాయణపరం బ్రహ్మతత్వన్నారాయణఃపరః" అనుశ్రుతివలన పరబ్రహ్మమైనట్టియు 'అపహతపాప్మాదివ్యోదేవఏకోనారాయణః'అనుశ్రుతివలనదోషరహితుడైనట్టియు 'నారాయణాదేవ సముత్పద్యన్తే। నారాయణాత్ప్రవర్తన్తే।నారాయణాత్ప్రలీయన్తే' ఇత్యాదిశ్రుతులవలన నిఖిలజగదేకకారణుడైనట్టియు 'యస్సర్వజ్ఞస్సర్వవిత్" అనుశ్రుతివలన సర్వజ్ఞుడయినట్టియు "యస్సర్వేషు భూతేషుతిష్ఠం త్సర్వేభ్యోభూతేభ్యోఽంతరోయం సర్వాణిభూతానినవిదుఃయస్య సర్వాణి భూతానిశరీరం యస్సర్వాణి భూతాన్యంతరోయమయతి ఏషత ఆత్మాంతర్యామ్యమృతః"అనుశ్రుతివలన సర్వాంతర్యామియగుటచేతనుసర్వశరీరకుడైనట్టియు 'సత్యకామస్సత్యసంకల్పః' అను శ్రుతివలన సత్యసంకల్పుడైనట్టియు 'పాదోస్యవిశ్వాభూతాని। విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేనస్థితోజగత్' మహావిభూతికలవాడైట్టియు, అస్యేశానాజగతోవిష్ణుపత్నీ, లక్ష్మీవిశిష్టుడైనట్టియు "ఏకోహవై నారాయణఆసీత్" నారాయణుని పొందడమునకు ఉపాయమున్ను ఆఉపాసనమున్ను చెప్పేనిమిత్తమున్ను ఆఉపాసనాంగమైనదిన్ని ఆత్మజ్ఞానపూర్వకమైన కర్మానుష్ఠానముచేతను సాధించతగినది పొందునటువంటి జీవునియొక్క యథార్థదర్శనము జ్ఞానయోగ కర్మయోగస్వరూప నిష్ఠాద్వయముచేతను సాధించతగినదని చెప్పబడెను.

3. మధ్యమే భగవత్తత్వయాథాత్మ్యావాప్తిసిద్ధయే।
జ్ఞానకర్మాభినిర్వర్త్యో భక్తియోగఃప్రకీర్తితః॥

టీక॥ మధ్యమే=మధ్యమషట్కమందు, భగవత్తత్వయాథాత్మ్యావాప్తిసిద్ధయె, భగవత్ హరీతస్మృతిలో॥ 3॥ ఐశ్వర్యంచ తథావీ

ర్యం తేజశ్శక్తిరనుత్తమా। జ్ఞానంబలం యదేతేషాం షణ్ణాంభగఇతీరితః॥ ఏభిర్గుణైః పూర్ణవాన్ యస్సఏవభగవాన్ హరిః । నిత్యాచయా భగవతీ ప్రోచ్యతే మునిసత్తమైః । విశ్వరూపాచసాదేవిసుభగాకమలాలయా। ఈశ్వరీసర్వజగతాం విష్ణుపత్నీసనాతనీ । తస్యాఃపతిత్వాచ్ఛ్రీశస్య భగవానితి చోచ్యతే। తస్మాత్తుభగవాన్ ఛ్రీమానేకార్థో మునిభిస్స్మృతః । భగవానితిశబ్దోయం తథాపురుషఇత్యపి । నిరుపాధిచవర్తేత వాసుదేవేఖిలాత్మని। వక్ష్యంతికేచిద్భగవాన్ జ్ఞానవానితిసత్తమైః । జ్ఞానోపిభగశబ్దోయంయుజ్యతే మునిసత్తమైః । తద్వాసుదేవేనోక్తం స్యాత్తామన్యత్వాత్తతోయథా। తస్మాత్కల్యాణగుణవాన్ శ్రీమానోయం జగత్పతిః। సఏవభగవాన్విష్ణుర్వాసుదేవ స్సనాతనః। భగవతే శ్రీమతేచేత్యే కార్థేప్రోచ్యతే బుధైః" విష్ణుపురాణములో "సంభర్తేతి తథాభర్తా భకారార్థద్వయాన్వితః । నేతాగమయితాస్రష్టా గకారార్థస్తథామునే । ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసశ్శ్రియః । జ్ఞానవైరాగ్యయోశ్చైవషణ్ణాం భగఇతీరణా । వసన్తితత్రభూతాని భూతాత్మన్యఖిలాత్మని । వచసర్వేషుభూతేషు వకారార్థస్తథామునే । జ్ఞానశక్తిబలైశ్వర్యవీర్యతేజాంస్యశేషతః । భగవచ్ఛబ్దవాచ్యాని వినాహేయైర్గుణాదిభిః । ఏవమేవ మహాభాగమైత్రేయ భగవానితి । పరంబ్రహ్మభూతస్య వాసుదేవస్యనాన్యథా । శబ్దోయంనోపచారేణ హ్యన్యత్రహ్యుపచారతః"॥ ఇత్యాదిప్రమాణప్రతిపాద్య భగవచ్ఛబ్దవాచ్యుడైన, తత్వ 'తత్వంనారాయణఃపరః' అనుశ్రుతిచేతను తత్వమైన నారాయణునియొక్క, యాథాత్మ్య=యథార్థముగా, అవాప్తిసిద్ధ్యై=పొందునిమిత్తము, జ్ఞానకర్మాభినిర్వర్త్యః జ్ఞాన=జ్ఞానయోగముచేతను, కర్మ=కర్మయోగముచేతను, అభినిర్వర్త్యః=మిక్కిలిపరివర్తించతగిన, భక్తియోగః=భక్తియోగము, ప్రకీర్తితః=చెప్పబడెను.

తాత్పర్యము॥ మధ్యమషట్కమందు పరబ్రహ్మమైన పరమపురుషస్వరూపమున్ను ఉపాసనమున్ను భక్తిశబ్దవాచ్యమనబడును. అదే

ముందుముందు "యంతఃప్రవత్తిర్భూతానాం యేనసర్వమిదంతతం । స్వ కర్మణాతమభ్యర్చ్యసిద్ధిం విందతిమానవః" ఇదిమొదలు "విముచ్యని ర్మమశ్శాన్తో బ్రహ్మభూయాయకల్పతే । బ్రహ్మభూతః ప్రసన్నాత్మా నశోచతినకాంక్షతి । సమస్సర్వేషు భూతేషు మద్భక్తింలభతేపరాం" ఈ లాగున సంక్షేపించి చెప్పుచున్నాడు. ఉపాసనమైతే భక్తిస్వరూప మునుపొందుటే పరబ్రహ్మమును పొందుటకు ఉపాయమని వేదాన్త వాక్యముచేతను సిద్ధమైనది. "తమేవంవిద్వానతిమృత్యుమేతి । తమే వంవిద్వానమృత ఇహాభవతి" ఇత్యాదులచేతను చెప్పబడినది వేదన ము. "ఆత్మావా అరేద్రష్టవ్యో శ్రోతవ్యో మంతవ్యో నిధిధ్యాసి తవ్యః । ఆత్మాన మేవలోకముపాసీత్ । సత్వశుద్ధౌద్రువాస్మృతిః । స్మృతి ర్లంభే సర్వగ్రంథీనాం విప్రమోక్షః" బ్రహ్మసూత్రములో "ధ్యా నాచ్చ । భిద్యతేహృదయగ్రంథిశ్ఛిద్యన్తే సర్వసంశయాః। క్షీయన్తే చాస్య కర్మాణితస్మిన్ దృష్టేపరావరే" ఇత్యాదులచేతను ఒకేఅర్థమువలన స్మృతిసంతానరూపమైనట్టియు దర్శనసమానాకారమైనట్టియు ధ్యానము ఉపాసనశబ్దవాచ్యమని తోచబడుచున్నది. తిరిగిన్ని "నాయమాత్మాప్ర వచననే నలభ్యోన మేధయాంనబహునాశ్రుతేన। యమేవైష వృణుతేతేన లభ్యస్తస్యైష ఆత్మావివృణుతేతనూంస్వాం" అని విశేషణమువలన పర బ్రహ్మముచేతను వరించబడుటకు కారణమైన స్మరణవిషయము మిక్కి లి ప్రియమయినదగుటచేతను తానున్ను మిక్కిలి ప్రియరూపమైన స్మృ తిసంతానమే ఉపాసనశబ్దవాచ్యమని నిశ్చయించబడెను. అదే భక్తి యని చెప్పబడెను. "స్నేహపూర్వ మనుధ్యానం భక్తిరిత్యభిధీయతే" ఈవచనములవలన "తమేవం విద్వానమృత ఇహాభవతి । నాన్యః పన్థా అయనాయవిద్యతే । నాన్యఃపన్థావిద్యతేయనాయ । నాహంవేదైర్న తప సానదానే నచేజ్యయా । శక్యఏవంవిధోద్రష్టుం దృష్టవానసిమాంయథా। భక్త్యాత్వనన్యయాశక్య అహమేవం విధోర్జున। జ్ఞాతుంద్రష్టుం చతత్వేన

ప్రవేష్టుంచ పరంతప" ఈప్రమాణములకు ఏకార్థము సిద్ధమైనది. ఇంతేగాక మిక్కిలి పొందదగిన భగవత్తత్త్వముయొక్క యథార్థము ఆమహాత్మ్యము జ్ఞానపూర్వకమైనట్టిన్ని దేవతాంతరఫలాంతరత్యాగముచేతను ప్రియప్రియపక భూతైకనిష్ఠమైనట్టిన్ని ఫలదశయందున్ను మరలని భక్తియోగనిష్ఠ చెప్పబడెను. అధికైశ్వర్యముకోరేవారలకు ఆత్మకైవల్యము కోరేవారలకున్ను భక్తియోగము ఆయాలపేక్షాసాధనమని చెప్పబడెను.

4॥ ప్రధానపురుషవ్యక్త సర్వేశ్వర వివేచనం।
కర్మధీర్భక్తి రిత్యాది పూర్వశేషోన్తి మోదితః॥

టీక॥ ప్రధానపురుషవ్యక్త సర్వేశ్వరవివేచనం ప్రధాన='ప్రధానంప్రకృతిస్త్రియా' మిత్యమరః ప్రకృతిలోను, పురుష='క్షేత్రజ్ఞఆత్మాపురుష' ఇత్యమరః జీవునిలోను, వ్యక్త=స్పష్టమైన, సర్వేశ్వర=ముండకోపనిషత్తులో 'ఏషసర్వేశ్వర ఏషసర్వజ్ఞ ఏషోంతర్యామ్యేషయోని సర్వస్య ప్రభవాప్యయా భూతానాం' గారుడపురాణములో "సర్వేశ్వ రేశ్వరే విష్ణౌ శ్రీశ్రీనారాయణాహ్వయే" అని ఇత్యాదిప్రమాణములచేతను నారాయణునియొక్క, వివేచనం=విచారణనుగూర్చి, కర్మధీర్భక్తిరిత్యాది కర్మ=కర్మయోగము, ధీ=జ్ఞానయోగము, భక్తిరిత్యాది=భక్తియోగము మొదలైనవి, పూర్వశేషోన్తిమోదితః పూర్వశేషః=పూర్వమందు చెప్పగామిగిలినది, అన్తిమోదితః=అంతిమషట్కముచేతను చెప్పబడెను.

తాత్పర్యము॥ మూడవషట్కమందు బ్రహ్మసూత్రములో "నచస్మార్తమతద్ధర్మాభి లాపాచ్ఛారీరశ్చ। గుహాంప్రవిష్టా వాత్మానౌహి తద్దర్శనాత్" పారమాత్మికోపనిషత్తులో "ద్వావేతౌపక్షీ అచరంచరంతౌనోధురం వ్యధునీతేయశ్చైనం భునక్తిభోక్త్రీస్వాహా" నారాయణములో "అజామేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీంప్రజాం జనయంతీగ్ సరూపాం। అజోహ్యేకో జుషమాణోనుశేతేజహాత్యేనాం భుక్త

భోగామజోన్యః" శ్వేతాశ్వతరోపనిషత్తులో "ప్రధానక్షేత్రజ్ఞపతిర్గుణేశః" విష్ణుపురాణములో ౧॥ ౨॥ ౧౯॥ ప్రధానపుంసవ్యక్త కాలాస్తుప్రవిభాగశః। విష్ణోస్స్వరూపాత్పరతోదితేద్వేరూపే ప్రధానపురుషశ్చ విప్ర" కూర్మపురాణమున "ప్రకృతింపురుషంచైవ ప్రవిశ్యపురుషోత్తమః। క్షోభయామాసభగవాన్ సృష్ట్యర్థంజగతోవిభుః" బృహత్సంహితలో "ఏకోవిభక్తః పరమః పురుషోవిష్ణురుచ్యతే। ప్రకృతిః పురుషః కాలస్త్రయపతే విభాగతః" ఇత్యాదిప్రమాణములచేతను ప్రకృతిజీవులు, ఆప్రకృతిజీవసంసర్గరూపమైన ప్రపంచము, ఈశ్వరుడు వీర్లయొక్క యథార్థము కర్మయోగస్వరూపము జ్ఞానయోగస్వరూపము భక్తియోగస్వరూపము ఆయాయోగములయొక్క స్వీకరించు విధానములున్ను రెండుషట్కములచేతను చెప్పబడినది. ఈషట్కముచేతను శోధించబడెను.

5॥ అస్థానస్నేహకారుణ్య ధర్మాధర్మధియాకులం।
పార్థంప్రపన్నముద్దిశ్య శాస్త్రావతరణంకృతం॥

టీక॥ అస్థానస్నేహకారుణ్య ధర్మాధర్మధియాకులం అస్థాన=స్థానముకానట్టి యుద్ధభూమియందు, స్నేహ=స్నేహముయొక్కయు, కారుణ్య=దయయొక్కయు, ధర్మ=ధర్మముయొక్కయు, అధర్మ=అధర్మముయొక్కయు, ధియా=బుద్ధిచేతను, ఆకులం=వ్యాకులమునుపొందినట్టిన్ని, ప్రపన్నం=బ్రహ్మపురాణములో "శరణంత్వాంప్రపన్నాయేధ్యానయోగవివర్జితాః। తేపిమృత్యుమతిక్రమ్య యాన్తితద్వైష్ణవంపదం॥ అహిర్బుధ్న్యేన యద్యేన కామకామేన నసాధ్యంసాధనాన్తరైః ముముక్షుణాయత్సాంఖ్యేన యోగేనచభక్తితః॥ ప్రాప్యతేపరమంధామయతో నావర్తతే యతిః। తేనతేనాప్యతే తత్త్న్యాసేనైవమహామునే॥ పరమాత్మాచతేనైవ సాధ్యతేపురుషోత్తమ ఇతి" నారాయణములో "తస్మాన్న్యాస మేషాం తపసామతిరిక్త మాహుః। న్యాసఇత్యాహుర్మనీషిణో బ్రహ్మాణం। తేషాంతుతపసాం న్యాసమతిరిక్తం తపశ్శ్రుతం। నిక్షేపాపరపర్యాయోన్యా

సః పంచాంగసంయుతః । సన్యాసస్త్యాగ ఇత్యుక్తశ్శరణాగతిరిత్యపి ” ఇత్యాదిప్రమాణములచేతను శరణాగతుడైన, పార్థం=అర్జునుని, ఉద్దిశ్య=ఉద్దేశించి, శాస్త్రావతరణం శాస్త్ర=అధ్యాత్మశాస్త్రముయొక్క, అవతరణం=బోధ, కృతం=చేయబడెను.

తాత్పర్యము॥ స్థానముకానట్టి యుద్ధభూమియందు పుట్టిన స్నేహముచేతను, దయచేతను, ప్రకృతిని పొందనట్టిన్నీ, రాజులకు యుద్ధము పరమధర్మమైనప్పటికిన్నీ, అధర్మముగా తలచినట్టిన్నీ, ధర్మేచ్ఛచేతను శరణాగతుడైన అర్జునునుద్దేశించి జీవయథార్థజ్ఞానముచేతను, ఫలాభిసంధిరహితమైన యుద్ధమునకు ఆత్మప్రాప్త్యుపాయజ్ఞానముచేతనేతప్ప, ఈయర్జునునికి మోహము శమించదని తలచి పరమపురుషుడైన శ్రీకృష్ణభగవానులచేతను అధ్యాత్మశాస్త్రబోధ చేయబడెను.

6॥ నిత్యాత్మా సంగకర్మేహా గోచరాసాంఖ్యయోగధీః ।
ద్వితీయేస్థితధీలక్షా ప్రోక్తాతన్మోహశాంతయె॥

టీక॥ నిత్యాత్మాసంగకర్మేహా గోచరా నిత్య=నిత్యమైన, ఆత్మా=జీవవిషయమైనదియు, అసంగ=ఫలాపేక్షితముగానట్టియు, కర్మ=కర్మలవిషయమైన, ఈహా=అభిలాషచేతను, గోచరా=తెలుసుకోబడునదియు, స్థితధీలక్షా=జ్ఞాననిష్ఠే సాధనముగాగల, సాంఖ్యయోగధీః=సాంఖ్యయోగమందైనబుద్ధి, ద్వితీయె=రెండవయధ్యాయమందు, తన్మోహశాన్తయె తత్=ఆఅర్జునునియొక్క, మోహశాన్తయె=మోహశాన్తినిమిత్తము, ప్రోక్తా=చెప్పబడెను.

తాత్పర్యము॥ ఈప్రకారముగా జీవనిశ్చయమును యుద్ధమనేపేరుగల కర్మప్రాప్తిసాధనత్వమును ఎరుగకపోవుటవలన శరీరమే జీవమనే జ్ఞానముచేతను మోహమును పొందినట్టిన్నీ, ఆమోహముచేతను యుద్ధమువలన మరలిన• అర్జునునియొక్క మోహశాన్తినిమిత్తము కఠోపనిషత్తులో ‹‹ అజోనిత్యశ్శాశ్వతోయం పురాణోనహన్యతేహన్యమానే శరీ

రే" భగవద్గీతలలో॥ అ॥౨॥ "అజోనిత్యశ్శాశ్వతోయం పురాణః" ఇత్యాది ప్రమాణములచేతను నిత్యజీవవిషయమైన సాంఖ్యబుద్ధియు, ఆసాంఖ్యబుద్ధిపూర్వకమైన "బ్రహ్మణ్యాధాయకర్మాణి సంగంత్యక్త్వాకరోతియః" ఫలాపేక్షితముకానట్టి కర్మానుష్ఠానరూప కర్మయోగవిషయమైన బుద్ధియు, జ్ఞాననిష్ఠా సాధనముగలదిగా రెండవయధ్యాయమున చెప్పబడెను.

శ్లో॥ అసక్త్యాలోకరక్షాయై గుణేష్వారోప్యకర్తృతాం।
సర్వేశ్వరేవాzన్యస్యోక్తా తృతీయేకర్మకార్యతా॥

టీక॥ అసక్త్యా=ఆత్మకంటే వ్యతిరిక్తవస్తువును పరిగ్రహించుటయందు ఆపేక్షారహితముచేతను, లోకరక్షాయై=ప్రజలను రక్షించునిమిత్తము, గుణేషు=గుణములయందైన, కర్తృతాం=కర్తృత్వమును, ఆరోప్య=ఆరోపించి, సర్వేశ్వరేవా=చిత్తిలో, "అంతఃప్రవిష్టంకర్తారమేతం అంతః=ప్రవిష్టశ్శాస్తా జనానాగ్ సర్వాత్మా॥ మయిసర్వాణి కర్మాణిసన్యస్యాధ్యాత్మచేతసా। నిరాశీర్నిర్మమోభూత్వా। యుధ్యస్వవిగతజ్వరః" ఇత్యాదిప్రమాణములచేతను సర్వేశ్వరుడైన నారాయణునియందు, కర్తృతాం=కర్తృత్వమును, న్యస్య=ఉంచి, కర్మకార్యతా=కర్మయొక్క కార్యత్వము, తృతీయే=మూడవయధ్యాయమునందు, ఉక్తా=చెప్పబడెను.

తాత్పర్యము॥ అదేప్రకారముగా మోక్షేచ్ఛగలవారలచేతను పొందదగినదగుటచేతను ఉపనిషత్తులయందు చెప్పబడిన 'అపహతపాప్మా' అనేశ్రుతివలన సమస్తమైన అవిద్యాదిదోషవాసనలేనివాడును "యతో వాచోనివర్తన్తే అప్రాప్యమనసాసహ ఆనందం బ్రహ్మణోవిద్వాన్" అను శ్రుతివలన అవధిలేనట్టియు, అధికమైనట్టియు, బ్రహ్మసూత్రములో, 'అతోzనన్తేన తథాహిలింగం' ప్రమాణమువలన అసంఖ్యేయమైనట్టియు, "అపహతపాప్మా విజరోవిమృత్యోర్విశోకో విజిఘత్సోzపిపాసస్సత్యకామస్సత్య

సంకల్పః” ఇత్యాదులవలన కల్యాణగుణగణములుగల పరబ్రహ్మమైన పురు షోత్తముని పొందుటకు ఉపాయమైన వేదనము ఉపాసనధ్యానాదిశబ్దవా చ్యము. ‘బ్రహ్మేశానశితికంఠంచ యూర్వాన్యా దేవతాస్మృతాః । ప్రతిబుద్ధా న సేవన్తే యస్మాత్పరమితంఫలం’ ఇత్యాదిప్రమాణమువలన దేవతాంతరఫ లాంతరత్యాగముచేతను ప్రాప్యప్రాపకభూతైక నిష్ఠమైనట్టియు, ఫలదశ యందు మరల నట్టిభక్తిని చెప్పనిమిత్తము ఆ అంగమైన ‘య ఆత్మాZప హతపాప్మా’ ఇదిమొదలు ప్రజాపతివాక్యముచేతను చెప్పబడినట్టియు, పొం దునట్టి జీవునియొక్క యథార్థదర్శనము నిత్యమైనట్టియు, జ్ఞానపూర్వకమై నట్టియు, ఫలాభిసంధిరహితకర్మనుపొంది జ్ఞానయోగముచేతను సాధించతగినదని చెప్పబడెను. ప్రజాపతి వాక్యమందైతే దహరవాక్యముచేతను, చె ప్పబడిన పరవిద్యాశేషముగలదగుటచేతను, పొందునట్టి ఆత్మయొక్క స్వ రూపసాక్షాత్కారము ‘‘యస్తమాత్మాన మనువిద్య విజానాతి” అనిపలికి జాగరిత స్వప్నసుషుప్త్యతీతుడైన ప్రత్యగాత్మస్వరూపమును శరీరము లే నిదానినిగా ప్రతిపాదించి బ్రహ్మసూత్రములో ‘‘సంపద్యావిర్భావస్వేన శబ్దాత్ । ఏవమేవైష సంప్రసాదోZస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరంజ్యో తిరుపసంపద్య స్వేనరూపేణాభినిష్పద్యతే॥ ఈలాగున దహరవిద్యయొక్క ఫలముచేతను, ఉపసంహరించబడినది. ఇచ్చటనున్న ‘అధ్యాత్మయోగా ధిగమేన దేవం । మత్వాధీరోహర్ష శోకౌజహాతి’ ఇవి మొదలుగాగలవాట్ల యందు ‘దేవంమత్వా’ అని విధీయమానమైన బ్రహ్మవిద్యాంగమైనదగుట చేతను ‘అధ్యాత్మయోధిగమేన’ అని జీవజ్ఞానమున్ను చేసి, ‘నజాయతే మ్రి యతేవావిపశ్చిత్’ ఇత్యాదులచేతను జీవస్వరూపమును పరిశీలించి, ‘అ ణోరణీయాన్మహతోమహీయా నాత్మాZస్యజంతోః నిహితోగుహాయాం’ ఇది మొదలుకొని ‘మహాంతం విభుమాత్మానం మత్వాధీరోనశోచతి। నా యమాత్మా ప్రవచనేన లభ్యోనమేధయానబహునాశ్రుతేన యమేవై ష వృణుతేతేనలభ్య స్తస్యైష ఆత్మావివృణుతేతనూగ్ స్వామ్’ ఇత్యా

దులచేతను, పరబ్రహ్మస్వరూపమున్ను, ఆఉపాసనమున్ను, ఆఉపాస నకు భక్తిస్వరూపముగలుగుటను ప్రతిపాదించి, "విజ్ఞాన్ సారథిర్యస్తు మనః ప్రగ్రహవాన్నరః సోధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదం" ఈలాగున పరబ్రహ్మ విద్యయొక్క ఫలముచేతను ఉపసంహరించ బడినది. మూడవయధ్యాయమందు ప్రకృతితోటి కూడిన మోక్షేచ్ఛ గలవానికి త్వరితముగా జ్ఞానయోగమందు అధికారము లేకపోవుటవలన కర్మయోగమే ఆచరించతగినది. జ్ఞానయోగమునకు అధికారైనప్పటికిన్నీ కర్తృత్వములేని అనుసంధానపూర్వకమైన కర్మయోగమే మంచిదని హేతువుతోటికూడా చెప్పబడినది. విశిష్టమైనదగుటచేతను నిర్దేశించుటకైతే విశేషముగా కర్మయోగమే చేయదగినదని చెప్పబడెను.

శ్లో॥ ప్రసంగాత్స్వస్వభావోక్తిః కర్మణోఽకర్మతాస్యచ ।
భేదాఃజ్ఞానస్యమాహాత్మ్య చతుర్థాధ్యాయఉచ్యతే॥

టీక॥ ప్రసంగాత్=ప్రసంగమువలన, స్వస్వభావోక్తిః=తమయొక్క స్వభావమును చెప్పుటయు, కర్మణః=కర్మకు, అకర్మతా=అకర్మత్వము, అస్యచ=ఈకర్మలయొక్కను, భేదాః=భేదములు, జ్ఞానస్య=జ్ఞానముయొక్క, మాహాత్మ్యం=మహాత్మున్ను, చతుర్థాధ్యాయే=నాల్గవ యధ్యాయమునందు, ఉచ్యతే=చెప్పబడెను.

తాత్పర్యము. ఈ చతుర్థాధ్యాయముచేతను యీకర్మయోగమునకే సమస్తమైనజగత్తుల నుద్ధరించేనిమిత్తము మన్వంతరాదులయందే ఉపదేసించబడినదగుటచేతను, చేయుదగినదానిని నిశ్చయముగా చేసి అంతర్గతజ్ఞానము గలదగుటచేతను, ఈకర్మయోగమునకే జ్ఞానయోగాకారత్వమును కనపరచి కర్మయోగస్వరూపమును, ఆకర్మయోగస్వరూపభేదములున్ను, కర్మయోగమందు జ్ఞానాంశమునకే ప్రాధాన్యత్వమున్ను చెప్పబడెను. ప్రసంగమువలన భగవంతునియొక్క అవతారయథార్థత చెప్పబడెను,

శ్లో॥ కర్మయోగస్య సౌకర్యం శైఘ్ర్యం కార్త్స్న తద్విధాః ।
బ్రహ్మజ్ఞానప్రకారశ్చ పంచమాధ్యాయ ఉచ్యతే॥

టీక॥ కర్మయోగస్య=కర్మయోగముయొక్క, సౌకర్యం=సుకరత్వము, శైఘ్ర్యం=త్వరగాలభించుటయును, కార్త్స్న=కొన్నియైన, తద్విధాః=ఆవిధులును, బ్రహ్మజ్ఞానప్రకారశ్చ=బ్రహ్మజ్ఞానవిధమున్ను, పంచమాధ్యాయె=అయిదవయధ్యాయమందు, ఉచ్యతె=చెప్పబడెను.

తాత్పర్యము॥ పంచమాధ్యాయమందు కర్మయోగము ఆత్మను పొందుటకు సాధనమైనదగుచుండగా, జ్ఞాననిష్ఠలో త్వరయు, కర్మయోగాంతర్గతమైన అకర్తృత్వానుసంధాన విధానమున్ను, ప్రతిపాదించి వాట్లమూలమైన జ్ఞానమునున్ను పరిశీలించబడెను.

శ్లో॥ యోగాభ్యాసవిధిర్యోగీ చతుర్ధాయోగసాధనం ।
యోగసిద్ధిస్స్వయోగస్య పారమ్యంషష్ఠఉచ్యతె॥

టీక॥ యోగాభ్యాసవిధిః=యోగాభ్యాసవిధి, యోగీ=యోగముకలవాడు, చతుర్థాయోగసాధనం=నాలుగువిధములైనయోగసాధనలును, యోగసిద్ధిః=యోగప్రాప్తియును, స్వయోగస్య=స్వకీయమైనయోగముయొక్క, పారమ్యం=ఉత్కృష్టత్వమును, షష్ఠే=ఆరవయధ్యాయమందు, ఉచ్యతె=చెప్పబడెను.

శ్లో॥ స్వయాథాత్మ్యం ప్రకృత్యాస్య తిరోధిశ్శరణాగతిః ।
భక్తిభేదః ప్రబుద్ధస్య శ్రైష్ఠ్యంసప్తమ ఉచ్యతే॥

టీక॥ స్వయాథాత్మ్యం=తనయొక్కయథార్థము, ప్రకృత్యా=ప్రకృతిచేతను, అస్య=ఈజీవునికి, తిరోధిః=తిరోధానము, శరణాగతిః (పరేచ్ఛాయత్తభూమ్నాపి స్వేచ్ఛయాఽవిఘాతితః । సర్వంపరవశందుఃఖ మిత్యాద్యంనాతిబాధకం। స్వతశ్శేషత్వకైంకర్యే నకుతాప్యసుఖావహే। కర్మజత్వాత్తథాతస్య లోకేచ వ్యభిచారతః । సుఖానందమహిమ్నాచ ప్రాగ్దుఃఖాపేక్షణాదపి । మోహాదుఃఖే తథాస మితిమూఢవిజల్పితం।

సుఖస్య మోహనత్వంహి తామసత్వాద్వ్యపాధిభిః। సుఖాయచభవేత్కాప్వపి పూర్వదుఃఖాభిమర్శనమ్' ఇత్యాదుల చేతను శరణాగతి, భక్తిభేదః=భక్తులలో భేదము, ప్రబుద్ధస్య=జ్ఞానియొక్క, శ్రైష్ఠ్యం=శ్రేష్ఠత్వము, సప్తమే=ఏడవయధ్యాయమందు, ఉచ్యతే=చెప్పబడెను.

తాత్పర్యము॥ ఏడవయధ్యాయమందు ఉపాస్యుడైనట్టిన్ని పరబ్రహ్మమైనట్టిన్ని వాసుదేవునికి సమస్త చేతనాచేతన వస్తుశేషిత్వమున్ను, శ్వేతాశ్వరమందు 'నతస్యకశ్చిత్పతిరస్యలోకేనచేశితానైవచతస్యలింగం। నకారణం కరణాధిపాధిపో నతాస్య కశ్చిజ్జనితానచాధిపః' కారణత్వమును పరమాత్మికోపనిషత్తులో 'సపకైకస్సాధారస్సాధిష్టానో నాధిష్టానః' ఆధారత్వమును 'యస్సర్వాణి భూతానిశరీరం జగత్సర్వం శరీరస్తే' ఇత్యాదిశ్రుతుల చేతను, సర్వశరీరమైనవాడగుట చేతను, "సర్వంఖల్విదంబ్రహ్మ" సర్వవిధములుగలవాడగుట చేతను, 'బ్రహ్మైవేదగ్ సర్వం' సర్వశబ్దవాచ్యత్వమును 'సర్వాంతరోయమతి। అంతః ప్రవిష్టశ్శాస్తాజనానాగ్ సర్వాత్మా' సర్వనియంతృత్వమును 'సత్యకామస్సత్యసంకల్పః' సమస్తకల్యాణగుణగణముల చేతనున్ను, ఆకృష్ణుని కే పరత్వము సత్వరజస్తమోమయమైన దేహేంద్రియత్వము చేతను, భోగ్యత్వము చేతనున్ను, ఉన్నట్టి మాండూకోపనిషత్తులో "అనాదిమాయయాసుప్తోయదాజీవః ప్రబుధ్యతే" అనాదికాల ప్రవృత్త దుష్కృతప్రవాహమునకు కారణములైన అభిప్రాయముల చేతను, జీవునికి తిరోధానము మిక్కిలి ఉత్కృష్ట సుకృతమునకు కారణమైన భగవంతునియందైన ప్రపత్తి చేతనున్ను, ఆతిరోధానము యొక్క మర్లుట సుకృతతారతమ్యము చేతనున్ను, ప్రపత్తియొక్క విశేషత్వమువలనను ఇంతేగాక ఉపాస్యుడైన పరమపురుషస్వరూపయథార్థత్వము ప్రకృతి చేతను, జీవతిరోధానము అనివృత్తినిమిత్తము భగవత్ప్రపత్తిననీ ఉపాసకవిధులలో భేదమును జ్ఞానియొక్క శ్రేష్ఠత్వమున్ను చెప్పబడెను.

శ్లో॥ ఐశ్వర్యాక్షరయాథాత్మ్య భగవచ్ఛరణార్థినాం।
వేద్యోపాదేయభావానా మష్టమే భేదఉచ్యతే॥

టీక॥ వేద్యోపాదేయభావానాం వేద్య=తెలుసుకోతగినట్టియు, ఉపాదేయ=పొందతగినట్టియు, భావానాం=అభిప్రాయములుగల, ఐశ్వర్యాక్షరయాథాత్మ్య భగవచ్ఛరణార్థినాం ఐశ్వర్య=ఐశ్వర్యముయొక్కయు, అక్షర=నాశములేనిదానియొక్కయు, యాథాత్మ్య=రూఢిగల, భగవచ్ఛరణార్థినాం=భగవత్పాదములను కోరేవారలయొక్క, భేదః=భేదము, అష్టమే=యెనిమిదవయధ్యాయమందు, ఉచ్యతే=చెప్పబడెను.

తాత్పర్యము॥ ఐశ్వర్యము యొక్కయు నశించనిదానియొక్కయు యధార్థమైన భగవత్ప్రాప్త్యపేక్షచేతను, ఉపాసకభేదముగల భగవంతుని పొందేఇచ్ఛగలవాడు, నిత్యయుక్తుడగుటచేతను, ఒకనియందే భక్తిగలవాడగుటచేతను, మిక్కిలి పరమపురుషునికి ఇష్టుడగుటచేతనున్ను, శ్రేష్ఠత్వమును దుర్లభత్వమునున్ను ప్రతిపాదించి, ఈమూడింటికి తెలుసుకోతగిన దానియొక్కయు, పొందదగినదానియొక్కయు, భేదములను చెప్పెను. ఈఅష్టమాధ్యాయమందు ప్రస్తుతములై తెలుసుకోతగిన వానియొక్కయు, పొందదగినదానియొక్కయు, భేదములను వివరించెను.

శ్లో॥ స్వమహాత్మ్యం మనుష్యత్వే పరత్వంచ మహాత్మనాం।
విశేషోనవమేయోగో భక్తిరూపః ప్రకీర్తితః॥

టీక॥ మనుష్యత్వే=మనుష్యత్వమందు, స్వమహాత్మ్యం=తమయొక్కమహాత్మ్యము, పరత్వంచ=పరత్వమున్ను, మహాత్మనాం=జ్ఞానులయొక్క, విశేషః=విశేషము, భక్తిరూపః=భక్తిరూపమైన, యోగః=యోగము, నవమే=తొమ్మిదవ యధ్యాయమందు, ప్రకీర్తితః=చెప్పబడెను.

తాత్పర్యము॥ ఉపాసకభేద నిబంధనవిశేషములు చెప్పబడినవి. ఈఅధ్యాయమందైతే ఉపాస్యుడైన పరమపురుషునియొక్క మహాత్వమున్ను జ్ఞానులయొక్క విశేషమున్ను పరిశోధించి భక్తిస్వరూపమైన

ఉపాసనయొక్క స్వరూపము చెప్పబడెను.

శ్లో॥ స్వకల్యాణగుణానన్త్య కృత్స్నస్వాధీనతామతిః ।
భక్త్యుత్పత్తివివృద్ధ్యర్థం విస్తీర్ణా దశమోదితా॥

టీక॥ భక్త్యుత్పత్తివివృద్ధ్యర్థం భక్తి=భక్తియొక్క, ఉత్పత్తి=ఉత్పత్తినిమిత్తము, వివృద్ధ్యర్థం=అభివృద్ధినిమిత్తము, స్వకల్యాణగుణానన్త్యకృత్స్నస్వాధీనతామతిః స్వ=తనసంబంధమైన, కల్యాణగుణ=కల్యాణగుణములయొక్క, అనన్త్య=అంతములేకపోవుటయున్ను, కృత్స్న=సమస్తము, స్వాధీనతా=స్వాధీనమగుటయొక్క, మతిః=బుద్ధియు, విస్తీర్ణా=విస్తారముగా, దశమోదితా=పదవయధ్యాయమందు చెప్పబడెను.

తాత్పర్యము॥ ఈప్రకారముగా భక్తియోగముయొక్క సిద్ధినిమిత్తము, ఆభక్తియోగముయొక్క అభివృద్ధినిమిత్తమున్ను 'అక్షరాత్పరతః పరః' అనే శ్రుతివలన సకలేతరవిలక్షణమైన స్వాభావికమైన భగవంతునియొక్క అసాధారణమైన కల్యాణగుణములయొక్క సమూహములతో కూడా భగవంతుడు సర్వాత్ముడగుట. అందువలననే భగవద్వ్యతిరిక్తమైన సమస్తమైన జీవప్రకృతిస్వరూపమైన వస్తుజాతము "యస్య సర్వాణి భూతాని శరీరం" అనుశ్రుతివలన భగవచ్ఛరీరమగుటచేతను భగవదాయత్తస్వరూపస్థితి ప్రవృత్తులు గలుగుట చెప్పబడెను.

శ్లో॥ ఏకాదశే స్వయాథాత్మ్య సాక్షాత్కారావలోకనం ।
దత్తముక్తావిదిప్రాప్త్యో ర్భక్త్యేకోపాయతా తథా॥

టీక॥ ఏకాదశే=ఏకాదశాధ్యాయమందు, అస్య=ఈనారాయణునియొక్క, యాథాత్మ్యసాక్షాత్కారావలోకనం యాథాత్మ్య=యథార్థమైన, సాక్షాత్కార=ప్రత్యక్షముయొక్క, అవలోకనం=చూచుటయు, తథా=ఆప్రకారముగా, దత్తముక్తౌ=దత్తముక్తులు, ప్రాప్త్యోః=పొందుటకు, భక్త్యేకోపాయతా=భక్తి ఒకటే ఉపాయమగుట, ఇతి=ఈలాగునని చెప్పబడెను.

తాత్పర్యము॥ భక్తియోగనిష్ఠులకు, ప్రియుఁడైనట్టిన్ని పరబ్రహ్మమైనట్టిన్ని షడ్గుణైశ్వర్యసంపత్తిగలిగినట్టిన్ని నారాయణునియొక్క అస్థులేనట్టి ఐశ్వర్యమును ప్రత్యక్షము చేసుకొనేటందుకు ఇచ్ఛగల అర్జుననిమిత్తము అవధిలేనట్టి అతిశయము దయయు ఔదార్యము సౌశీల్యము మొదలైన గుణసముద్రుఁడైనట్టియు సత్యసంకల్పుఁడైన కృష్ణభగవానులచేతను స్వసిద్ధమైన తనయొక్క ఐశ్వర్యము కనుపరచఁబడెను. ఆఈభగవదసాధారణమైన స్వభావమును సమస్తమునకు భగవదాయత్త స్వరూపస్థితి ప్రవృత్తిత్వమును భగవంతునివలన వినడముచేతనే ఈ ప్రకారమేయని నిశ్చయించుకొని ఆప్రకారమయిన భగవంతుని ప్రత్యక్షము చేసుకొనుటకై ఇచ్ఛగల అర్జునుడు పలికెను. అట్లేప్రకారము భగవదనుగ్రహాంతరము చూచినవాఁడాయెను.

శ్లో॥ భక్తిశైఘ్ర్యముపాయోక్తి రశక్తస్యాత్మనిష్ఠతా।
తత్ప్రకారాస్త్వతి ప్రీతి ర్భక్తే ద్వాదశఉచ్యతే॥

టీక॥ భక్తిశైఘ్ర్యం=భక్తియందుత్వరయు, ఉపాయోక్తిః=ఉపాయముయొక్క చెప్పుటయు, అశక్తస్య=శక్తిలేనివానికి, ఆత్మనిష్ఠతా=పరమాత్మనిష్ఠయు, భక్తే=భక్తునియందు, అతిప్రీతిః=అధికప్రేమయు, తత్ప్రకారాః=ఆవిధములు, ద్వాదశే=ద్వాదశాధ్యాయమందు, ఉచ్యతే=చెప్పబడెను.

తాత్పర్యము॥ యథార్థముగా భగవద్జ్ఞానదర్శనమును పొందేవారలకు దేవతాంతరఫలాంతరత్యాగముచేతను, ప్రాప్యప్రాపకభూతైకనిష్ఠమైనట్టియు, ఫలదశయందు మరలనట్టిన్ని, భగవద్భక్తిచేతనే ముఖ్యముగాపొందుటయు, అనంతరము ఆత్మప్రాప్తిసాధనమైన ఆత్మోపాసనవలన భక్తిస్వరూపమైన భగవదుపాసనము స్వసాధ్యసిద్ధియందు శీఘ్రమైనదగుటవలనను, సుఖముగాపొందేదగుటవల్లనన్నున్ను, శ్రేష్ఠమైనది భగ



వదుపాసనము. ఉపాయమున్ను, అదిన్నీ శక్తిలేనివానికి అక్షరునియందు నిష్ఠయు, ఆలపేక్షములున్ను చెప్పబడెను.

శ్లో॥ దేహస్వరూపమాత్మాప్తి హేతురాత్మవిశోధనం।
బంధహేతుర్వివేకశ్చ త్రయోదశ ఉదీర్యతే॥

టీక॥ దేహస్వరూపం=దేహముయొక్క యథార్థజ్ఞానము, ఆత్మాప్తిహేతుః=ఆత్మనుపొందుటకుకారణము, ఆత్మవిశోధనం=ఆత్మయొక్క పరిశీలనము, బంధహేతుః=బంధమునకుగారణము, వివేకః=జ్ఞానము, త్రయోదశే=పదమూడవయధ్యాయమందు, ఉదీర్యతే=చెప్పబడెను.

తాత్పర్యము॥ పదమూడవయధ్యాయమందు దేహాజీవులయొక్క స్వరూపము, దేహముయొక్క యథార్థపరిశీలనయు, దేహమును విడచిపెట్టిన ఆత్మనుపొందుటకు ఉపాయమును, వివిక్తాత్మస్వరూపపరిశీలనయు, అట్టిఆత్మకున్ను ప్రకృతిసంబంధముకారణము ఆహేతువువలన జ్ఞానానుసంధానపరికారమున్ను చెప్పబడినది. పరస్పరముకలుసుకొనిన ప్రకృతిజీవుల సంబంధమైనస్వరూపముయొక్క యథార్థత్వమును గుర్తెరిగి భగవద్భక్తి చేతను అనుగ్రహించబడిన అమానిత్వాదులచేతను బంధమువలన విడవబడునని చెప్పబడెను.

శ్లో॥ గుణబంధవిధా తేషాం కర్తృత్వం తన్నివర్తనం।
గతిత్రయస్వమూలత్వం చతుర్దశ ఉదీర్యతే॥

టీక॥ తేషాం=వారలయొక్క, కర్తృత్వం=కర్తృత్వము, తన్నివర్తనం=ఆకర్తృత్వముయొక్క మరలించుటయు, గుణబంధవిధాః=గుణబంధవిధులు, గతిత్రయస్వమూలత్వం గతిత్రయ=సత్వరజస్తమోగుణగతిత్రయము, స్వమూలత్వం=తనయొక్క మూలకారణము, చతుర్దశే=పదునాలుగవయధ్యాయమందు, ఉదీర్యతే=చెప్పబడెను.

తాత్పర్యము॥ బంధమునకు కారణము పూర్వపూర్వసత్వాదిగుణమయమైన సుఖాదిసంగమని చెప్పబడెను. గుణములకు బంధముయొక్క

హేతుత్వవిధము గుణనివర్తనవిధము చెప్పబడెను. జీవునికి కార్యకార ణోభయావస్థలయందు ప్రకృతియొక్క సంబంధము సత్వరజస్తమోగుణసం గమూలము భగవంతునిచేతనే చేయబడినదని చెప్పి గుణసంగప్రకారము ను సవిస్తరముగా ప్రతిపాదించి గుణసంగనివృత్తిపూర్వకమైన ఆత్మను యథార్థముగా పొందుటయున్ను భగవంతునియొక్క భక్తికారణమని చె ప్పబడెను.

శ్లో॥ అచిన్మిశ్రాద్విశుద్ధాచ్చ చేతనాత్పురుషోత్తమః।
వ్యాపనాద్భరణాత్స్వామ్యా దన్యఃపంచదశోదితః॥

టీక॥ అచిన్మిశ్రాత్ = ప్రకృతిమిశ్రులైనట్టియు, విశుద్ధాచ్చ = పరి శుద్ధులైన, చేతనాత్ = జీవులకంటెను, ముండకోపనిషత్తులో “ దివ్యో హ్యమూర్తః పురుషస్సబాహ్యాభ్యంతరో హ్యజః, అప్రాణో హ్య మనా శ్శుభ్రోహ్యక్షరాత్పరతఃపరః ” అనుశ్రుతివలన, పురుషోత్తమః = పురు షోత్తముడు, వ్యాపనాత్ = “ వ్యష్టభ్నాద్రోదసీవిష్ణు రేతో దాధారపృథివీ మభితో మయూఖైః” అనుశ్రుతివలన వ్యాపించుటవలనను, భరణాత్ = ‘ యఆండకోశేభువనంబిభర్తి భర్తాసన్ర్భియమాణోబిభర్తి ’ అనుశ్రు తివలనభరించుటవలననున్ను, స్వామ్యాత్ = స్వామియగుటవలననున్ను, అన్యః = అన్యుడుగా, పంచదశోదితః = పదియేనవఅధ్యాయమందుచెప్ప బడెను.

తాత్పర్యము॥ సేవించదగినభగవంతునియొక్క క్షరాక్షరస్వరూప మైనబద్ధముక్తవిభూతియగుటనున్ను, విభూతులైన క్షరాక్షరపురుషద్వ యులకంటెను, ‘సమస్తహేయరహితం విష్ణ్వాఖ్యం పరమంపదం, తేజోబ లైశ్వర్యమహావబోధ సువీర్యశక్త్యాదిగుణైకరాశిః, సచసర్వగుణోపేత’ ఇ త్యాదిప్రమాణములవలన సమస్తహేయగుణములకు ప్రతిభటమైనట్టిన్ని, ప్రదేశభేదముచేతను కాలభేదముచేతనున్ను అమంగళకరుడుకానివాడ గుటచేతను, అత్యంతోత్కర్షచేతనున్ను విసజాతీయునికి ‘అతోస్మిలో

కేవేదేచప్రథితఃపురుషోత్తమః' ఇత్యాదిప్రమాణములచేతను పురుషో త్తముఁడగుటయున్ను, చెప్పనిమిత్తము ఆరంభించుచున్నారు. ఇంతేకాక కలుసుకోబడునట్టియు, విడవబడునట్టియు, ప్రకృతిజీవులయొక్కయధార్థము. ఆకలుసుకొనుటకున్ను విడుచుటకున్ను గుణసంగమమునకు ఆవిపర్యయమునకు కారణత్వము. సృష్టిప్రకారములచేతను ఉన్న ప్రకృతిజీవులకు భగవద్విభూతిత్వము. విభూతిగల భగవంతునికి విభూతియైన ప్రకృతికంటెను జీవునికంటెనున్ను బద్ధముక్తోభయరూపముకంటెను "పతింవిశ్వస్యాత్మేశ్వరగ్ శాశ్వతగ్ శివమచ్యుతం" నాశరహితుఁడగుటచేతను 'అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణస్థితః' వ్యాపించేవాఁడగుటచేతను 'భర్తాసన్ బ్రియమాణోబిభర్తి' భరించేవాఁడగుటచేతను, హారీతస్మృతిలో "జగతః కారణత్వంచతథాస్వామిత్వమేవచ" ఇత్యాదులచేత స్వామియగుటచేతను 'అధికంతుభేదనిర్దేశాత్। అధికోపదేశాత్తు। బాదరాయణస్యైవంతద్దర్శనాత్' ఇత్యాదిసూత్రములవల్లన అర్థాంతరుఁడగుటచేతను, స్కాందపురాణాంతర్గతభూతపురీమాహాత్మ్యములో ౩॥౬॥౮॥ 'పురైవసత్వాత్పురుషం కథయన్తిమనీషిణః। క్షరాక్షరాభ్యామధికః కథ్యసేపురుషోత్తమః। ఏవం గౌణాన్యనంతానినామానితవకేశవ। దేవసర్వశరీరత్వాత్సర్వశబ్దైరుదీర్యసే॥' ఇత్యాదులవలన పురుషోత్తముఁడగుటచేతను యధార్థముగా యీపదియే నవయధ్యాయమందు వర్ణించబడెను.

శ్లో॥ దేవాసురవిభాగోక్తి పూర్వికా శాస్త్రవశ్యతా।
తత్త్వానుష్ఠానవిజ్ఞాన స్థేమ్నే షోడశఉచ్యతే॥

టీక॥ తత్త్వానుష్ఠానవిజ్ఞానస్థేమ్నే తత్త్వ=తత్వముయొక్కయు, అనుష్ఠాన=అనుష్ఠానముయొక్కయు, విజ్ఞాన=విశేషజ్ఞానముయొక్కయు, స్థేమ్నే=నిశ్చయముగా స్థితులుకొరకు, దేవాసురవిభాగోక్తిపూర్వికా, దేవా="విష్ణుభక్తిపరోదేవో విపరీతస్తథాసురః" అనుప్రమాణమువలన దేవతలయొక్కయు, అసుర='అసురాదైత్యాదైతేయా దనుజేంద్రారి

దానవా ఇత్యమరః రాక్షసులయొక్కయు, విభాగ=భేదమును, ఉక్తి=తె లుపుడిచేయుట, పూర్వకా=ముందుగాగల, శాస్త్రవశ్యతా=శాస్త్రవశ్య త్వము, షోడశే=పదియాఱవయధ్యాయమందు, ఉచ్యతే=చెప్పబడెను.

తాత్పర్యము॥ దేవతలయొక్కయు రాక్షసులయొక్కయు విభా గోక్తిపూర్వకముచేతను పొందదగిన తత్వజ్ఞానమునకున్ను, ఆపొందుట కు ఉపాయజ్ఞానమునకున్ను, వేదము ఒకటేకారణమని చెప్పబడెను. అ నంతరము చెప్పబడిన సమస్తప్రయోజనముయొక్క ఉండడమందు శా స్త్రవశ్యత్వమును చెప్పనిమిత్తము శాస్త్రవశ్యము అశాస్త్రవశ్యభేద మైన దేవాసురసృష్టియొక్క భేదము పదియారవయధ్యాయమందు చె ప్పబడెను.

శ్లో॥ అశాస్త్రమాసురం కృత్స్నం శాస్త్రీయం గుణతః పృథక్।
లక్షణం శాస్త్రసిద్ధస్య త్రిధాసప్తదశోదితం॥

టీక॥ అశాస్త్రం=శాస్త్రవిహితముకాని, కృత్స్నం=సమస్తము, ఆసురం=అసురసంబంధమైనది, పృథక్=అసురభిన్నమైనదైవికము, గుణ తః=సత్వరజస్తమోగుణములవలన, శాస్త్రీయం=శాస్త్రవిహితమైనది, శాస్త్రసిద్ధస్య=శాస్త్రజ్ఞునియొక్క, లక్షణం=స్వరూపము, త్రిధా=మూ డువిధములుగా, సప్తదశోదితం = పదియేడవయధ్యాయమందు చెప్ప బడెను.

తాత్పర్యము॥ శాస్త్రవిహితముకానివాడు అసురుడగుటచేతను, ఫలాభావమగుటయు, శాస్త్రవిహితునికిన్ని గుణములవలన త్రివిధము లైన ఫలములు శాస్త్రజ్ఞునియొక్కలక్షణము చెప్పబడెను.

శ్లో॥ ఈశ్వరే కర్తృతాబుద్ధిస్సత్వోపాదేయతాంతిమే।
స్వకర్మపరిణామశ్చ శాస్త్రసారార్థ ఉచ్యతే॥

టీక॥ ఈశ్వరే=నారాయణునియందు, కర్తృతాబుద్ధిః=ఈశ్వరః కారయేత్సర్వం తచ్చేశ్వర్యకృతఃస్వయం। అనాదిత్వాదదోషశ్చ పూర్ణ

శక్తిస్తతోహారే రితి' చిత్తిలో 'అంతః ప్రవిష్టం కర్తారమేతం' ఈశ్రుతుల యందు చెప్పినరీతిగా కర్తృత్వబుద్ధియు, సత్వోపాదేయతాం సత్వ='మా యాంనసేవేభద్రం తేనవృథాధర్మమాచరే । శుద్ధభావంగతోభక్త్యా శాస్త్రా ద్వేద్మిజనార్దనమ్' అనుప్రమాణమువలన శుద్ధసత్వముయొక్క, ఉపాదేయ తాం=అంగీకరించడమును, స్వకర్మపరిణామశ్చ .స్వ=తమసంబంధమైన, కర్మ=కర్మయొక్క, పరిణామశ్చ=పరిణమించుటయు, శాస్త్రసారార్థః శాస్త్ర=శాస్త్రసంబంధమైన, సార=సారముయొక్క, అర్థః=అర్థము, అంతిమే=పదునెనిమిదవయధ్యాయమందు, ఉచ్యతె=చెప్పబడెను.

తాత్పర్యము॥ సర్వేశ్వరుడైన నారాయణునియందు సమస్తకర్మ లయొక్కయు, కర్తృత్వానుసంధానము, సత్వరజస్తమోగుణములయొ క్కకార్యములైన సృష్టిస్థితిసంహారములయొక్క విచారణచేతను సత్వమే ముఖ్యమని అంగీకరించవలసినది; పరమపురుషుని ఆరాధనచేసే రూపమైన వర్ణానుసారమైన కర్మలకు భగవంతుని పొందుటకు ప్రవర్తనలో ఒకవిధ ము. సమస్తమైన గీతాశాస్త్రముయొక్క సారాంశము భక్తియోగమని ఈప్రమాణములు చెప్పుచున్నవి.

శ్లో॥ కర్మయోగస్తపస్తీర్థ దానయజ్ఞాదిసేవనం ।
జ్ఞానయోగోజితస్వాంతైః పరిశుద్ధాత్మనిస్థితిః॥

టీక. తపస్తీర్థదానయజ్ఞాదిసేవనం తపః=నారాయణములో 'తప సాదేవాదేవతానుగ్రఆయన్ । తపసఋషయస్సువరన్వవిందన్ । తపసా సప త్నాన్ ప్రణుదామారాతీస్తపసి సర్వంప్రతిష్ఠితం । ఋతంతపస్సత్యం తప శ్శ్రుతం తపశ్శాంతం తపోదానం తపోయజ్ఞస్తపోభూర్భువ స్సువర్బ్రహ్మై తదుపాస్యైతత్తపః, తపఇతితపోనానశనాత్పరం యద్ధిపరంతపస్తద్దుర్ధర్షం తద్దురాధర్షం తస్మాత్తపసిరమన్తే' ఇత్యాదిప్రమాణములవలన బ్రహ్మ విద్యాంతరంగసాధనమైన ఇంద్రియనియమనస్వరూపమైనతపస్సు, తీర్థ= "యత్రనారాణోదేవః పరమాత్మా సనాతనః । తత్రకృత్స్నం జగత్పార్థ

తీర్థా న్యాయతనానిచ । తత్పుణ్యం తత్పరంబ్రహ్మ తత్తీర్థంతత్తపోవనం' ఇత్యాదులచేతను తీర్థము, దాన=నారాయణములో 'దానం యజ్ఞానాం వరూథం దక్షిణాలోకేదాతారగ్ం సర్వభూతాన్యుపజీవన్తి దానేనారాతీరపానుదన్త దానేన ద్విషన్తో మిత్రాభవన్తి దానే సర్వంప్రతిష్ఠితం తస్మాద్దానం పరమంవదన్తి' ఇత్యాదులచేతను దానము, యజ్ఞాదిసేవనం= యజ్ఞో వైవిష్ణుః, యజ్ఞ ఇతియజ్ఞోహి దేవానాం యజ్ఞేనహి దేవాదివంగతా యజ్ఞేనా సురానపానుదన్త యజ్ఞేనద్విషన్తో మిత్రాభవన్తి యజ్ఞే సర్వం ప్రతిష్ఠితం తస్మాద్యజ్ఞం పరమంవదన్తి' ఇత్యాదిప్రమాణములవలన యజ్ఞాది=యజ్ఞము మొదలైనవాట్లయొక్క, సేవనం=సేవించుట, కర్మయోగః=కర్మయోగమనబడును. "జితస్వాంతైః" కటోపనిషత్తులో ౧॥ 'యస్తువిజ్ఞానవాన్భవతి, సమనస్కస్సదాశుచిః, సతుతత్పదమాప్నోతి యస్మాద్భూయోనజాయతే' జిత=జయించబడిన, స్వాంతైః=అంతఃకరణలచేతను, పరిశుద్ధాత్మని=కటోపనిషత్తులో॥ ౧౯॥ 'తంవిద్యాచ్ఛుక్రమమృతం' పరిశుద్ధ=నిర్మలమైన, ఆత్మని=ఆత్మయందు, స్థితిః=ఉండుట, జ్ఞానయోగః=జ్ఞానయోగమనబడును.

శ్లో॥ భక్తియోగః పరైకాంత్య ప్రీత్యాధ్యానాదిషుస్థితిః ।
త్రయాణామపియోగానాం త్రిభిరన్యోన్యసంగమః॥

టీక॥ పరైకాంత్యప్రీత్యా, పర='తత్త్వం నారాయణఃపరః' అనే శ్రుతివలన నారాయణునియందే, ఐకాంత్య=నిశ్చయమైన, ప్రీత్యా=ప్రేమచేతను, ధ్యానాదిషు=బ్రహ్మసూత్రములో, 'ధ్యానాచ్చ' నారాయణములో, 'మానసంవై ప్రాజాపత్యం పవిత్రం మానసేన మనసాసాధుపశ్యతి మానసావృషయః ప్రజాఅసృజన్త మానసే సర్వంప్రతిష్ఠితం తస్మాన్మానసం పరమంవదన్తి' ఇత్యాదిప్రమాణములవలన ధ్యానముమొదలైనవాట్లయందు, స్థితిః=ఉండుట, భక్తియోగః=భక్తియోగమనబడును. త్రయాణాం=మూడైన, యోగానామపి=కర్మజ్ఞాన భక్తియోగ

ములకున్ను, త్రిభిః=మూడింటితోటి, అన్యోన్యసంగమః, అన్యోన్య= పరస్పరము, సంగమః=కలుసుకొనుట.

శ్లో॥ నిత్యనైమిత్తికానాంచ పరారాధనరూపిణాం ।
ఆత్మదృష్టేస్త్రయోప్యేతే యోగద్వారేణ సాధకాః॥

టీక॥ పరారాధనరూపిణాం, పర=‘ఆత్మానారాయణఃపరః’ అను శ్రుతివలన నారాయణునియొక్క, ఆరాధనరూపిణాం=దక్షస్మృతౌ ‘యే యజన్తి పితౄన్ దేవాన్ బ్రాహ్మణాంశ్చహుతాశనాన్। సర్వభూతాత్మరాత్మానం విష్ణుమేవయజంతితే’ ఇత్యాదులవలన పూజారూపమైన, ‘నిత్యనైమిత్తికానాం’ నిత్య=పరాశరుంను, సంధ్యాస్నానం=‘జపోహోమదేవతానాంచపూజనం। వైశ్వదేవాతిథేయంచ షట్కర్మాణిదినేదినే’ ఇత్యాదులవలన నిత్యకర్మలకు, నైమిత్తికానాం=నైమిత్తికకర్మలకు, ఆత్మదృష్టేః, ఆత్మ=‘ఆత్మాజీవే ధృతౌదేహే స్వభావపరమాత్మనోః’ ఇత్యాదులవలన పరమాత్మయొక్క చూచుటకున్ను, ఏతే=ఈ, త్రయః= మూడు, యోగద్వారేణ=యోగపూర్వకముచేతను, సాధకాః=సాధకములు.

శ్లో॥ నిరస్తనిఖిలాజ్ఞానో దృష్ట్వాత్మానంపరానుగం।
ప్రతిలభ్యపరాంభక్తిం తయైవాప్నోతితత్పదమ్॥

టీక॥ నిరస్తనిఖిలాజ్ఞానః=“బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే । వాసుదేవస్సర్వమితి సమహాత్మాసుదుర్లభః” ఇత్యాదులవలన ‘జ్ఞాని, పరానుగం, పరధ్యానం, నారాయణః పరః’ అనుశ్రుతివలన నారాయణుని, అనుగం=‘సోశ్నుతేసర్వకామాన్ సహబ్రహ్మణా విపశ్చితేతి’ అనుశ్రుతివలన అనుసరించిపొందతగిన, ఆత్మానాం=తనను, దృష్ట్వా=చూచి, పరాం=ఉత్కృష్టమైన, భక్తిం=స్నేహపూర్వమును, ధ్యానం=‘భక్తిశ్చభిధీయతే’ భారతే, ‘భక్తియోగేన పాపాని దహ్యాంతె వైష్ణవోత్తమైః । శాంతకుంభస్య మాలిన్యమగ్నినాదహ్యతేయథా’

ఇత్యాదులవలన భక్తిని, ప్రతిలభ్య=పొంది, తయైవ=ఆభక్తిచేతనే, తత్పదం తత్=‘తత్త్వమసిశ్వేతకేతో’ తద్విష్ణోః పరమంపదమితి’ ఇత్యాదులవలన ఆనారాయణునియొక్క, పదం=‘సోధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమంపదం’ అనుశ్రుతివలన స్థానమును, ఆప్నోతి=‘బ్రహ్మవిదాప్నోతిపరమం’ అనుశ్రుతివలన పొందుచున్నాడు.

శ్లో॥ భక్తియోగస్తదర్థీచే త్సమగ్రైశ్వర్యసాధనం
ఆత్మార్థీచేత్త్రయోప్యేతే తత్కైవల్యస్యసాధకాః॥

టీక॥ భక్తియోగః=భక్తియోగము, తదర్థీచేత్=ఆభక్తియోగమునుకోరినట్లైన, సమగ్రైశ్వర్యసాధనం=పరిపూర్ణైశ్వర్యసాధనమైనది, ఆత్మార్థీచేత్=ఆత్మనుకోరినట్టయిన, ఏతే=ఈ, త్రయోపి=మూడును, తత్కైవల్యస్య, తత్=ఆభగవత్సంబంధమైన, కైవల్యస్య=‘ముక్తిః కైవల్యనిర్వాణ’ మిత్యమరః మోక్షమునకు, సాధకాః=సాధకములు.

శ్లో॥ ఐకాంత్యం భగవత్యేషాం సమానమధికారిణాం
యావత్ప్రాప్తి పరార్థీచేత్తదేవాత్యంతమశ్నుతే॥

టీక॥ ఏషాం=ఈ, అధికారిణాం=అధికారులకు, షడ్గుణైశ్వర్యముగలనారాయణునియందు, ఐకాంత్యం=తదేకనిష్ఠ, సమం=సమానము, యావత్ప్రాప్తిపరార్థీచేత్, యావత్=యెంత, ప్రాప్తిపరా=పొందవలెననిఆసక్తితోటి, అర్థీచేత్=కోరునో, తదేవ=అంతనే, అత్యంతం=మిక్కిలి, అశ్నుతే=అనుభవించుచున్నాడు.

శ్లో॥ జ్ఞానీతుపరమైకాంతీ తదాయత్తాత్మజీవనః
తత్సంశ్లేషవియోగైక సుఖదుఃఖస్తదేకధీః॥

టీక॥ తదాయత్తాత్మజీవనః=భారతమందు, ‘మద్భక్తజనవాత్సల్యం పూజాయాం చానుమోదనం । స్వయమభ్యర్చనం చైవ మమార్థేడంబవర్జనం । మత్కథాశ్రవణేభక్తిః స్వరనేత్రాంగవిక్రియా। మామనుస్మరణంనిత్యం యచ్చమాంభోపజీవతి॥ అనన్యదేవతాభక్తాః మద్భ

జ్ఞనప్రియాః । మామేవశరణంప్రాప్తా స్తేమద్భక్తాః ప్రకీర్తితాః' ఇత్యాదిప్రమాణములవలన, తదాయత్త=భగవదధీనమైన, ఆత్మజీవనః=స్వజీవనముగలవాడును, పరమైకాంతీ=హారీతస్మృతిలో ఁ॥ 'యస్తుభోగతయావిష్ణో స్సత్కృత్యంకురుతేసదా । సభవేత్పరమైకాంతీ మహాభాగవతోత్తమః' పరమైకాన్తిస్వరూపము చెప్పుచున్నాడు. హారీతస్మృతిలో॥ ఁ॥ 'తప్తచక్రాంకణం విష్ణోః కాదశ్యామ పోషణం । ధృతోర్ధ్వపుండ్రదేహత్వం తన్మంత్రాణాం పరిగ్రహః । నిత్యమామలకస్నానం దేవతాంతరవర్జనం। ధ్యానంమంత్రజపో హ్యామ స్తులస్యాపూజనంహరేః । ప్రసాదతీర్థసేవాచ తదీయానాంచపూజనం । ఉపాయాంతర సంత్యాగ స్తథామంత్రార్థచింతనం। శ్రవణంకీర్తనంచైవ సత్కృత్యకరణంతథా। అసత్కృత్యపరిత్యాగో విషయాంతరసేవనం । దానందమస్త పశ్చాచమార్జవం క్షాంతిరేవచ। అనృశంస్యం సతాంసంగః పారమైకాంత్యహేతవః। వైష్ణవః పరమైకాంతిర్నేతరో వైష్ణవస్మృతిః' ఇత్యాదిప్రమాణ ప్రతిపాద్యపరమైకాంతుడైన, జ్ఞానీతు=భగవద్గీతలలో 'తేషాంజ్ఞానీనిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే । ప్రియోహిజ్ఞానినో త్యర్థమహంసచమమప్రియః' ఈప్రమాణమువలన జ్ఞానియైతే, తత్సంశ్లేష వియోగైకసుఖదుఃఖః, తత్సంశ్లేష=భగవంతునితోటికలియుట, వియోగ=ఎడబాయుటలయందు, ఏక=ముఖ్యమైన, సుఖదుఃఖః=సుఖదుఃఖములుకలవాడు, తదేకధీః, తత్=ఆభగవంతునియందే, ఏకధీః=ముఖ్యబుద్ధిగలవాడు అగుచున్నాడు.

శ్లో॥ భగవద్ధ్యానయోగోక్తి వందనస్తుతికీర్తనైః
లబ్ధాత్మాతద్గతప్రాణా మనోబుద్ధీంద్రియక్రియః॥

టీక॥ "భగవద్ధ్యానయోగోక్తి వందనస్తుతికీర్తనైః" భారతం. 'శ్రవణం కీర్తనం విష్ణోస్స్మరణంపాదసేవనం। అర్చనంవందనం దాస్యం సఖ్యమాత్మనివేదనం। ఇతిపుంసాంహితావిష్ణోర్భక్తిశ్చనవలక్షణా' ఈప్రమాణమువలన, భగవత్=భగవంతుని, ధ్యాన=ధ్యానముచేతను, యోగ=

యమనియమాసనప్రాణాయామప్రత్యాహారధ్యానధారణసమాధులనెడి అష్టాంగయోగములచేతను, ఉక్తి=‘కథయన్తశ్చమాంనిత్యంతుష్యన్తి చరమన్తి చ’ అనిచెప్పడముచేతను, వందన=‘మన్మనాభవమద్భక్తోమద్యాజీమాంనమస్కురు’ నమస్కారముచేతను, స్తుతి=స్తోత్రములచేతను, కీర్తనైః=కీర్తనలచేతను, లబ్ధాత్మా, లబ్ధ=పొందబడిన, ఆత్మా=మనస్సుగలవాడై, తద్గతప్రాణమనోబుద్ధీంద్రియక్రియః” తత్=ఆభగవంతుని, గత=పొందబడిన, ప్రాణ=ప్రాణము, మనః=మనస్సు, బుద్ధి=బుద్ధియు, ఇంద్రియక్రియః=ఇంద్రియవ్యాపారములుకలవాడగుచున్నాడు.

శ్లో॥ నిజకర్మాదిభక్త్యంతం కుర్యాత్ప్రీత్యైవకారితః
ఉపాయతాం పరిత్యజ్య న్యసేద్దేవేతుతామభీః॥

టీక॥ నిజకర్మాదిభక్త్యంతం, నిజ=స్వకీయమైన, కర్మాది=కర్మయోగము మొదలు, భక్త్యంతం=భక్తియోగముపర్యంతము, ప్రీత్యైవ=సంతోషముచేతనే, కుర్యాత్=చేయవలెను. కారితః=చేయువాడు, ఉపాయతాం=ఉపాయమును, పరిత్యజ్య=లెస్సగావిడిచి, తాం=ఆఉపాయమును, అభీః=నిర్భయుడై, దేవే=దేవునియందు, న్యసేత్=ఉంచవలెను.

శ్లో॥ ఐకాంతాత్యంత దాస్యైకరతి స్తత్పదమాప్నుయాత్
తత్ప్రధానమిదం శాస్త్ర మితి గీతార్థసంగ్రహః॥

టీక॥ ‘ఐకాంతాత్యంతదాస్యైకరతిః’ ఐకాంత=‘విష్ణుధర్మే, నాన్యం దైవం నమస్కుర్యాన్నదైవం ప్రపూజయేత్ నాన్యప్రసాదం భుంజీత నాన్యదాయతనం విశేత్ తస్మాన్నాస్తీత్యుక్త్యః’ దేవతాంతరఫలాంతరత్యాగముచేతను ప్రాప్యప్రాపక భూతైకనిష్ఠమైనట్టిన్నీ, అత్యంత ఫలదా=ఫలదశయందుమరలనట్టిన్నీ, దాస్య=హారీతస్మృతిలో॥ ౧॥ ‘నైసర్గికంతు సర్వేషాం దాస్యమేవహరేస్సదా। సామ్యం పరస్వరూపస్యదాస్యం జీవస్య సర్వదా। ప్రాక్ప్రత్యగాత్మనోరూపం సామ్యందాస్యమితిస్థితిః। దాస్యమేవపరంధర్మం దాస్యమేవపరంహితం । దాస్యేనైవభవేన్ముక్తి రన్యథానిరయం

భవేత్' ఈలక్షణముగల దాస్యమందు, ఏకరతిః=ముఖ్యముగాఆసక్తిగలవాఁడు, తత్పదం తత్=ఆనారాయణునియొక్క, పదం='వైకుంఠభువనలోకంగమిష్యతి' అను శ్రుతివలనస్థానమును, ఆప్నుయాత్=పొందెనిమిత్తము, ఇదం=ఈ, శాస్త్రం=శాస్త్రము, తత్ప్రధానం=భగవత్ప్రధానము, ఇతి=ఈప్రకారము, గీతార్థసంగ్రహః=గీతార్థసంగ్రహము.

శ్రీమన్నైధ్రువకాశ్యపాన్వయ పయఃపారావార రాకానిశాకరస్య శ్రీమార్కండభూపతి పాదిమత్తేభకంఠీరవస్య
శ్రీకృష్ణమాచార్యస్య జ్యేష్ఠపుత్రేణ
సింహాద్రి అప్పన్దాసేన
గీతార్థసంగ్రహస్యటీకే
యం విరచితా.



గ్రంథము కావలయువారు—

శ్రీమాన్ మాడభూషి వాదిమత్తేభకంఠీరవం
సింహాద్రి అప్పలాచార్యులుగారు,

కానుకొల్లు,
లింగాల పోస్టు.
గుడివాడ తాలూకా,
కృష్ణాజిల్లా,

అని వ్రాసికొనవలయును.

